శ్రీ శారదాంబాయై నమః








శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

సౌమ్య — వసంత, గ్రీష్మ, వర్షర్తు పత్రికలు

పుటము 58. — సంచికలు 1, 2, 3.



సంపాదకుఁడు

కాకరపర్తి కృష్ణశాస్త్రి

# ఆంధ్రసాహిత్య పరిషత్తు

ప్రతిష్ఠాపకులు : 1911

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు
బహద్దరువారు, సి. బి. ఇ. డి. లిట్.,
పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :
శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :
శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
జమీందారు, ఉయ్యూరు.



## సంపాదకీయము

పాఠకమహాశయులారా !

మా పత్రికా స్వీకర్తలలో పలువురు చందాల బంపనం
నను, పుస్తక ముద్రణార్థము వలయుకాగితము లింతదనుక లభి
డుట చేతను, సంపాదకుఁడ నగు నేను రోగగ్రస్తుఁడనై మా
మున కేగుట చేతను, పత్రికాప్రచురణము నాంధ్రసాహిత్య
గావింప నాలస్య మొనరించినందులకు క్షంతవ్యము.

ఇట్లు,
సంపాదకుఁడు

హరిహర దేవాయ నమః

# ఉగాది (సౌమ్య)

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి

చ. తెలతె... ర మేల్కొని ను
అంచి పరాత్పరుఁ గాల్యకృత్యముల్
సలపి సశీతలోదకము
స్నాన మొనర్చి నవీనతింత్రిణీ
ఫలమును వేపపూ వనటి
పండ్లు గుడంబును మావిపిందియల్
గలిపినపచ్చడిన్ మెసవఁ
గా నగుఁగాదె యుగాది నెల్లరున్. ౧

ఉ. అంగదమీఱ నూరఁగల
యందఱుపెద్దలు రాముకోవెలం
దుం గణనాథుఁ గొల్చి కడుఁ
దోరపుభక్తిఁ బురోహితుండు పం
చాంగముఁ దా బఠింప విని
యాతని నించుక సత్కరించి భా
విం గలస్వీయలబ్ధి విని
పింప సుఖింతురు కొంద అందునన్. ౨

క. విని యాదాయంబును వ్యయ
మును స్వీయము రాజపూజ్యమును నవమానం
బును దనకందాయఫల
మ్మును సంతసమో విచారమో జనత గనున్. 3

సీ. రాజై నబుధుఁడు నీరసపురోహితరాష్ట్రి
గజశుభసస్యజంగమవిభుండు
గ్రామపాలకుఁ డశ్వరత్న దేశోద్యోగ
పతి యమాత్యుం డగుభానుమూర్తి
నరమృగమేఘసేనాపశుకాంతార్ఘ
నిచయాధిపతి యా శనిగ్రహంబు
ధాన్యాధిపతి భూజతతిపతి చంద్రుండు
గ్రామనాయకపరీక్షకుఁడు కుజుఁడు

తే. గీ. గణకు డహిపతి దేవతాగణగురుండు
రసపతియు వస్త్రపతియు నయ్యసురగురుఁడు
సౌమ్యసంవత్సరం బిది సౌమ్యదాయి
గాన దీనికి నాదుస్వాగతము నేఁడు. ౪

ఆ. వె. ప్రబలదుఃఖ మిడెఁ బరాభవవత్సరం
బా ప్లవంగ చిక్కు లందఁ జేసె
కీలకయును మాకుఁ గీడును గీలించె
సార్థకాఖ్య! సౌమ్య! స్వాగతమ్ము. ౫

తే. గీ. తండ్రికొడుకులు సౌమ్యవత్సరమునందు
చంద్రబుధులును రవిశనైశ్చరులు; వారు
ధాన్యరాజ్యాధిపతు లయి తనరినారు
సచివసేనాధిపతులై యెసంగినారు. ౬

చ. మలయసమీరపోతములు
మందగతిన్ మలయంగ గండుకో
యిలగమి మావిలేజిగురు
లించుక మెక్కుచుఁ బంచమస్వనం

బుల వెలింజిమ్మఁగా, మధుర
మ్ముల్ ఫలరాజము లామ్రముల్ విరా
జిలఁగ వసంతకాలము వ
సించు నుగాది కనంతరంబునన్. ౭

తే. గీ. అవని పూర్ణజలోపేత మై సమస్త
సస్యఫలనిస్తులం బగు; జనులలోన
బ్రబలమైత్రి ఘటిల్లుఁ బరస్పరమ్ము
సౌమ్యవత్సరమున దేశసౌమ్య మొదవు. ౮



# దయ సేయండి

శ్రీమతి అయ్యగారి సుందరమ్మ

తే. గీ. గాసిపెట్టుచు జనులను గసిమసంగి
తుది సుధాకరుఁ జేరితి వదె సుకృతము
పొందగారానియమృతత్త్వ మందినావు
కీలకా! యిది కలిధర్మకీలకమ్ము.

తే. గీ. కువలయానందకరుఁడవై కూర్మిఁ బ్రజల
కూడిమాడుచు వారి కేకొఱత నీక
ఏలుమా! సౌమ్య! నీ కెందు నితరు లెవరు
సాటిరా రని ధాత్రిని చాటి చెప్ప.



# సౌమ్య సంవత్సరాది

విద్వాన్ గున్నేపల్లి అక్షయలింగకవి

స్వాగత మిదె! నూత్నవత్సరమ! నీకు
స్వాగతము నీకు విమలపరిశాంత భావ!
స్వాగతము నీకు నమితానురాగరూప!
స్వాగతము నీకు సౌమ్యసంవత్సరమ్మ! 1

చ, తెలతెలవార లేచి యిలు దీరిచి మజ్జన మాచరించి, ని
ర్మలమతులై, యుగాది ననురక్తి జనింప, నవీనతింత్రిణీ
ఫలరసమున్, గుడ, మ్మనఁటిపండ్లును, నింబసుమమ్ము మావిపిం
దెలు గలపచ్చడిన్ మెసవి, తృప్తి వహింతురు ప్రాజ్ఞు, లిమ్మహిన్. 2

ఉ, కీలకనామవత్సరము క్లిష్టసమస్యలు రేపి, ఘోరకృ
త్యాలకు దారిచూపి, ప్రజ నాఱడిపెట్టి కళంకి యయ్యె, నీ
పాలన; నిట్టిదుస్థితులపా లొనరింపక, శాంతిమై నినున్
మేలన సౌమ్యవత్సరమ! మేలొనఁగూర్చి ప్రసిద్ధి నందుమా! 3

సీ. విలు వైనక్రొత్తవల్వలు దాల్చి హితులతో
సరససల్లాపముల్ సలుపువారు
భావికాలశుభాశుభమ్ముల గమనింప
పంచాంగమును విలోకించువారు
అనుగుణం బైనకూష్మాండాదిదానముల్
చేసి మనశ్శాంతిఁ జెందువారు
కవిసమావేశముల్ కావించి తమతమ
భాషాభిరుచి వ్యక్తపఱుచువారు

సతిసుతాదిక బాంధవితతిఁ గూడి
యిష్టమృష్టాన్నకలన సంతృప్తి నొందు
వారు నై, రెల్లరును నేతిపర్వ మగుచు
సౌమ్యసంవత్సరాది సాక్షాత్కరింప. 4

శా. కామ్యార్థమ్ముల దీర్ప నెల్లప్రజకుం గల్పాగమం బంచునిన్
సమ్యగ్జ్ఞాననిధుల్ బుధుల్ సముచితోత్సాహమ్ముతోఁ జూడనీ
సౌమ్యోదాత్తగుణానువర్తన మిలన్ సార్థక్యముం జెందఁగా
సౌమ్యాబ్దమ్మ! శుభప్రదాయి వయి శశ్వత్కీర్తి వర్తిల్లుమా! 5



# రష్యను మహాకావ్య యుగము

డాక్టర్ బొడ్డుబాటి కుటుంబరాయశర్మ,

ఫ్రెంచి మహాకావ్య యుగమునకు ముందు దారితీసినవారు యువరాజు 'యాంటియోక్ క్యాంటెమిర్' (క్రీ.శ. 1708-'44), 'వసిలి ట్రెడియకొవెస్కీ' (క్రీ.శ. 1703-'69) పండితులు. 'క్యాంటెమిర్' ఫ్రెంచిలో రచించిన హేళనాత్మక రచనలు రష్యను సారస్వతములో ప్రయత్నపూర్వకమై కళాత్మకమైన వాస్తవికత్వము ప్రవేశించుటకు నిదర్శనములై యున్నవి. 'ట్రెడియకొవెస్కీ' కి లఘుకావ్యకర్తగా గలకీర్తి, రష్యను ఛందః సంస్కర్తగాగల యశోలాభములను మసక బరుపలేదు. 'మిక్‌హైల్ లొమనొసావ్' పండితుఁడు (క్రీ.శ. 1711-'65) ఆధునిక రష్యను సాహిత్య ప్రత్యక్ష నిర్మాత. అతఁడు సర్వతోముఖప్రతిభాశాలి; పాండిత్యవిషయములో గ్రాంథిక వాగనుశాసనుఁడు

గను నూతన ఛందోద్రష్టగను అనన్యసామాన్యుఁడు. ఈతనికి సమకాలీనులలో (క్రీ. శ. 1717–'74) 'అలెగ్జాండర్ సుమరోకొవ్' అనుయాయి. ఇతఁడు రష్యనునాటకముల భండారమునే నిర్మించె ననవచ్చును; ప్రథమ సాహిత్యక విమర్శకుఁడు; ఆశతాబ్దిలో ప్రజ్ఞానిధియైన గేయకారుఁడు. 'లోమనోసోల్' నిర్మించిన ఉదాత్తసాహిత్య ప్రక్రియలు విషాదాంత నాటకమును వీరపురుషేతిహాసమును శోకగంభీర గేయకావ్యమునుగూడ ఉన్నతస్థాయికిఁ గొనిపోయినవి. 'సుమరోకోల్' 'రష్యన్ రెసైన్' బిరుదమునకు యోగ్యుఁడైనట్లు నటించినను పైని మొదటి రెండు ప్రక్రియలలోను శాశ్వతమైనరచన లేవియు సాగలేదు. 'మైకేల్ ఖెరస్కొవ్' (క్రీ. శ. 1733–1807) రచించిన 'రొష్యడ' అను వీరపురుషేతిహాసము (1775) ఆతనికొక పురుషాంతరమువఱకు 'రష్యను హోమరు' అనెడిబిరుదు సంపాదించిపెట్టెను. ఆ దినములలో శోకగంభీర గేయకావ్య మెక్కువ శక్తిసామర్థ్యములతో ప్రవర్ధిల్లఁజొచ్చినది. 'లోమనోసావ్' గేయములు రష్యనుభాషలో పవిత్ర మహనీయతయందును పర్యాయగాంభీర్యమునందును నద్వితీయములని నేఁటికి నెన్నికఁగనుచున్నవి. 'గవ్రిలాడెర్జావిన్' (క్రీ. శ. 1743–1816) తన గేయవాఙ్మయ సంధాన సామర్థ్యముచే 'లోమనోసావ్' నకు తుల్యుఁ డనిపించుకొనెనేగాని, యథార్థ మూహింపఁగ నతనికిఁగల ప్రతిభయు నిర్దుష్టమైన మనస్సృష్టిదర్శన వైభవమును 'లోమనోసావ్' కంటె నుత్తమశ్రేణికళాకారులకుఁజెందినవి. ప్రాయికముగఁ బరుషమై యపరిష్కృతమై యీతని కవిత్వము సాంద్రజీవిత స్పందనముచే వశముతప్పియుండును; సాంప్రదాయకత అనాగరకుల సాంప్రదాయకతయై యుండును.

ఉదాత్తములుగాని భాణకాద్యేతర సాహిత్యప్రక్రియల విషయములో సాంప్రదాయికత యొకగుణమై ప్రధానలక్షణముగా వర్ధిల్లినది. 'వెసిలిమెకొవ్' (క్రీ. శ. 1728–'78) రచించిన సంప్రదాయసిద్ధ

పరిహాసకావ్యములును, 'ఇవాన్ ఖెమ్నిట్సర్' (1744-'84) చెప్పిన కట్టుకథలును 'ఎలెగ్జ్యాండర్ ఎబిల్ సిమోవ్' (1742-1823), 'యాకొవ్ క్యాజ్ హిన్' 1742-'93), 'వసిలికాప్నిస్టు' (1757-1823) మున్నగు రచయితలుకూర్చిన నవ్వుగొల్పు సంగీతనాటకములును భాణకము లునుగూడ నాగరకతారహితములు అపరిష్కృతములైనను ఆ ప్రక్రి యలు జవమును జీవమునుగల వాస్తవికతనుమాత్రము ప్రదర్శించును.

వీనియందలి యీగుణము, 'లాఫాన్టేన్' రచించిన 'మనస్సు' అనుతత్త్వశాస్త్రగ్రంథమునకు 'ఇప్పొలిట్ బోగ్డనోవిచ్' (1742-1803) చేసిన బహువిఖ్యాతమగు అనుకరణమునందలి పాలితపడిన వికృతపు సొగసులకంటె, సహృదయాకర్షణముగలది. ఆ వాస్తవికతయే 'డెనిస్ ఫన్విజిన్' (1744-'92) రచించిన ప్రసిద్ధ భాణకములలో పుష్కలము, ప్రజ్ఞాపరిమితములై కనఁబడును. మోటుమానసులగు కొందఱు బంట్రాతులు తెలివితేటలతో కూర్చిన 'మైనర్' అను హేళనకావ్యము, రష్యనుసాహిత్యములో ప్రప్రథమమున మహాఘనముగ పాత్రసృష్టిని చేయఁగల్గినది. 'ఇవాన్ క్రిలొవ్' (1768-1844) అను ప్రసిద్ధకథకుఁడు రచించిన రచనలలో అనాదిగ ఘనమైన వాస్తవికతాసంప్రదాయములు పరాంకోటి నంటినవి. ఇతని 'కట్టుకథలు' అను ప్రథమప్రచురణము క్రీ. శ. 1809 లో వెలువడెను.

'స్టీల్', 'ఎడిసన్' మహాశయులను అనుసరించుచు క్రీ. శ. 1769లో వెలువడిన హేళనాత్మకములగు పత్రికలయందలి వచనము, పైఁజెప్పిన వాస్తవికతావిషయములనే వెల్లడించినది. 'నికొలస్‌నొవి కొవ్' (క్రీ. శ. 1744-1816) సంపాదకత్వమున సాగిన పత్రికలు లోక హిత భావప్రేరితములై తాత్కాలిక సాంఘిక దురాచార తీవ్ర విమర్శ సహాములై ప్రసిద్ధికెక్కినవి. రెండవ కేథరిన్ రాణి యిట్టి పత్రి కలను క్రీ. శ. 1773లో అణఁచివేసెను. దివ్యజ్ఞాన సమాజమునందు నొకానొక రహస్యశాఖకుఁజెందిన వ్యాఖ్యాత్తుఁడగు 'నొవికొవ్'

తత్సమాజములో దక్షిణపక్షమునకుఁ బ్రతినిధి. 'రాపిరొో' శిష్యుఁడగు 'అలెగ్జాండర్ రడిష్‌చెవ్' దాని వామపక్షమునకుఁ బ్రతినిధి. 'పీటర్స్‌బర్గునుండి మాస్కోవఱకు ప్రయాణము' అనెడి యాతని యలంకారపటు రచనము 'హ్యాంగ్‌మన్' వలన క్రీ. శ. 1790 లో దగ్ధమైనను నది దాసత్వ నిరంకుశత్వములను ప్రతిఘటింపఁ గల్గిన స్వాతంత్ర్యప్రబోధకమైన రచనము.

క్రీ. శ. 1791 ప్రాంతమున నికొలై కరంజిన్ (1765–1826) ప్రారంభించిన యుద్యమము, పదునెనిమిదవ శతాబ్దికిఁ జెందిన లౌకిక వికాసాత్మక కార్యక్రమమును గొనసాగించినది. 'కరంజిన్' చేసిన సాహిత్యక భాషా సంస్కారము, 'లొమొనొసావ్' వదిలపరచిన మతపరమగు స్లావనిక భాషను చాలవఱకు నిర్మూలించెను. ఫ్రాన్సు నుండి నూతన భావభంగిమలను వ్యాప్తిలోనికిఁ దెచ్చుచు, ఫ్రెంచి పదములతో నిండియుండి 'లొమొనొసావ్' వదిలించిపెట్టిన భాష సంపూర్ణముగ ననువాదపరమైయున్నది, వాక్యసంయోజన శయ్యా రీతులయందుకూడ నది ఫ్రెంచిలక్షణ లక్షితమైన భాష. సరళ సాహిత్య ప్రక్రియలకొఱకునుప్రాంజలమైన భాషకొఱకును 'కరంజన్' ప్రారంభించిన యుద్యమము కఱకుఁదనమును మోటదనమునుగల 'డెర్జావిన్' యుగశక్తులకు ప్రతిఘాతముకూడ నయ్యెను. 'రూసో' నెలకొల్పిన "ఇంద్రియజ్ఞాన నూతనవాదము"నకును కాల్పనిక పునరుజ్జీవనమునకుఁ జెందిన ప్రారంభదశలకును కరంజిన్ తొట్టతొదకు దారితీసినవాఁడై నాఁడు. అటు ఫ్రెంచి ప్రభావమును ఇటు సరళ కవితా విధానమునుగూడ గిట్టని సంప్రదాయపాక్షికులసంఘ మీాతని నెదిరించెను. ఈసంఘమునకు నాయకుఁడు ఎడ్మిరల్ అలెగ్జాండర్ షిష్కావ్ (క్రీ.శ. 1754–1841) 'సెమెన్ బాబ్రావ్' క్రీ.శ. 1767–1810), 'సెర్గూస్ షిరిన్‌స్కి షిఖ్మటావ్' యువరాజును (క్రీ.శ. 1783–1837) అను నీతని యనుయాయులు భక్తివేదాంతపరములుగ కవిత్వము

చెప్పఁగల సమర్థులు. కాని, వారిప్రాచీనపద్ధతి కాలమున కనుగుణము కాలేదు. వేసిలిజుకోవ్‌స్కీ (1783–1852), కాన్‌స్టెన్‌టైన్ బాట్యుష్కోవ్ (1787–1855) అనువారు కరంజిన్ శాఖీయులలో ప్రతిభాశాలురు. ఫ్రెంచి ల్యాటిన్ భాషలలోని శోకస్థాయి కావ్యకర్తలయందును పార్నీయందును బాట్యుష్కోవ్ శిష్యభావము కలవాఁడు. ఈతని శోకస్థాయి కృతులు మహాకావ్యములై యింద్రియతర్పణము గొల్పుచు రాగరహితములై యుండును. జుకోవ్‌స్కీయందు జర్మన్, ఆంగ్లభాషల ప్రభావములు జీర్ణించినవి. రష్యనుకవితలో విశుద్ధరత్నము లనఁదగు గేయములను కూర్చికూడ నితఁడు స్వకపోలకల్పితములైన కావ్యము లేమియుఁ జెప్పలేదు. అనువాదమునం దీతనిప్రజ్ఞ నిరుపమానము. క్రీ. శ. 1825 ప్రాంతమువఱకును నితఁ డాధునికులలో బ్రధానముగఁ గాల్పనికపూర్వయుగకవులరచనల ననువదించినాఁడు. వార్ధకములో భారత, పెర్షియన్, గ్రీకు దేశములయందలి మహనీయములగు వీరపురుషేతిహాసములపైఁ దృష్టి మరల్చెను. క్రీ. శ. 1847 నం దీతని సృష్టియగు " ఒడిస్సే " పరిపూర్ణరూపమున వెలువడినది. నికోలస్ నిడిచ్ (క్రీ. శ. 1784–1833) విరచితమై హోమరురచనకుఁ దీసిపోని "ఇలియడ్" ఇంతకుముందే (1830 లో) వెలసెను.



# "శ్రీ యాదగిరి లక్ష్మీనృసింహ స్తోత్రనక్షత్రమాలికా"

శ్రీ రాఘవాచార్యః

౧

శ్రీమచ్ఛ్రీరత్నగర్భాహృదయ సరసిజాత ప్రభాభాను బింబం
కంపాకంపాను కంపామృత రసభరితాహ్లాద ప్రహ్లాద డింభం।
శుంభత్సంరంభ గంభీరతను రుచిజిత ప్రావృడంభోదకాండం
వందే యాదక్ష్మాభృత్కటక పటుభుజారంహ లక్ష్మీనృసింహమ్॥

౨

అభ్రాజభ్రాజదవ్యాజ నిరుపమదయాసారధారానుసారం
కోపాటోప ప్రదీప్త ప్రకటతరగరుద్ద్వంద్వ భూమప్రతాపం।
వ్యాక్షిప్తస్పర్ధిగంత ప్రథితగుణగణారంభ పీడప్రమ్యవాహం
వందే..............................లక్ష్మీనృసింహమ్॥

౩

కౌటిల్యాటవ్యటత్కాంచన తనునయన భ్రాంతి కృచ్ఛంబరఘ్నం
లాంగల్యబ్జాంకుశేంద్రాయుధఝషశుభ రేఖోజ్జ్వలత్పన్నవాబ్జం।
ఆపన్నాపన్నగేంద్రం శుచినియమగుణార్యాభివంద్యాభిధేయం
వందే..............................లక్ష్మీనృసింహమ్॥

౪

స్వర్ధామార్ధే శితార్ధేందుమకుటద్రుహిణస్పర్ధ నిర్ధూననాఢ్యం
దుగ్ధాబ్ధా శేషవేషం ప్రళయశుచిరసజ్జాభజిహ్వోకరాళం
ధావళ్యబ్రహ్మసూత్రం కటితటఘటితప్రోతవస్త్రోత్తరీయం
వందే..............................లక్ష్మీనృసింహమ్॥

౫

రుష్యద్వ్యగ్రానిలాదప్రమదశమనకృచ్చండతుండాండజాగ్రం
జాగ్రద్వృద్ధత్విడోఘావఘనమఘమహీధ్రప్రౌఢలేఖాధినాథం
మిథ్యాస్వప్నాద్యవస్థాత్రయగహనదహద్ధవ్యవాహోపమానం
వందే..............................లక్ష్మీనృసింహమ్॥

౬

ఖండాఖండోక్తికాండం కరశరశరధిం మంజుమంజీరపుంజం
గాంభీర్యస్థైర్యధుర్యం రదపదనజితాస్తోకముక్తామృగాంకం
చేతోజాతాహితాభఃపరిభవభవభవారాధితామేయమూర్తిం
వందే...................................లక్ష్మీనృసింహమ్॥

౭

సంవిద్విద్యానవద్యం సురచిరశయనీకృత్యఫణ్యాధిపత్యమ్
మాగారోరఃకవాటం పరికటతరనటత్కేసరైర్భానురాంగం
భక్తవ్యక్తానురక్తం దరదరిదరసంసక్తదోర్లేలిహానం
వందే...................................లక్ష్మీనృసింహమ్,

౮

ధన్యం మాన్యం వదాన్యం విఫలితరిపురాజన్యమూర్ధన్యజన్యం
మాద్యద్విద్యుత్సముద్యద్విమలతనురుచివ్యాప్తరోదోంతరాళం
దాట్పేట్ప్యాభీష్టనష్టం గణితరణరణత్సింహనాదానుమోదం
వందే...................................లక్ష్మీనృసింహమ్॥

౯

చంచన్మాయాప్రపంచస్థితిలయకరణాద్యంతతంత్రస్వతంత్రం
కంబాలాభప్రతాపం కపటపటువటాలంబితప్రేక్ష్ణితంబం
రంగజ్జంఘాలజంఘాయుగ మవరిమిఆనందసందాభివంద్యం
వందే...................................లక్ష్మీనృసింహమ్॥

౧౦

లోకానీకావనైకం సకలకవనభుక్సత్రసంత్రాణతంత్రం
కారుణ్యార్ణోధినాథం ఘనరవవిలసన్నూపురాసాదపాదం
తాటంకద్యోతకర్ణం విషగళసుషమాతాండవానందకందం
వందే... ... ... ... ... .... లక్ష్మీనృసింహమ్॥

౧౧

యాదాక్ష్మాభృన్నిశాంతం గురుకవిబుధానీకసేవాప్రశాంతం
క్రీడాసాధోఽపశాంతిం పధికదురితనైర్మల్యకృద్వార్నిశాంతం
శాంతస్స్వాంతం మహాంతం మధుమదనమధర్మాధికారప్రహాంతం
వందే ... ... ... ... ... ...లక్ష్మీనృసింహమ్॥

౧౨

చండక్రోధాంగసంగాధికమకరశిరశ్ఖండితస్యందనాంగం
సర్వాశ్చర్యాతిచర్యం నిగమనిచయనాదప్రమోదప్రభావం
బిభ్యద్విభ్రాణి మధ్రింకపవిశదయశోరంజనం ఖంజనాభం
వందే ... ... ... ... ... లక్ష్మీనృసింహమ్॥

౧౩

మాకందామందసానందమృదు మధుసుధాగాధమాధుర్యసూక్తిం
అస్త్రాకాభ్యస్తకస్తూరికమలయజసంలిప్త దీప్తస్వరూపం
దేహాత్వ్యుద్ధూతమిత్రిం స్ఫురదురుసురభిస్రిగ్ధరం ముగ్ధకాయం
వందే ... ... ... ... ... ... లక్ష్మీనృసింహమ్॥

౧౪

శ్రీదం మోదందవాదం నతజనవిహితం చిత్స్రవంతీనగాహం
దారిద్ర్యార్తిప్రవిచ్ఛేదన ఘనకరుణాదీన చేతోఽంబుజాతం
మేశంకాశప్రకాశం మితవచనమఘక్లేశనాశావకాశం
వందే ... ... ... ... ... ... లక్ష్మీనృసింహమ్॥

౧౫

కైవల్యశ్రీదపాదం కలికలుషమహాత్వచ్ఛిదారూఢపాదం
సత్పూజాసాదపాదం సకలరుగపహారామూల్యసంపాదపాదం
శాపాస్త్రప్రమోదపాదం సురవగసరిదుద్భూతపూతాబ్జపాదం
వందే ... ... ... ... ... ... లక్ష్మీనృసింహమ్॥

౧౬

- మత్స్య -

వైశిష్ట్యాంత్యస్వరూపం విదితనిగమపాటచ్చరప్రచ్ఛిదాగ్ర్యం
సౌమ్యాసౌమ్యాగ్రిణాగ్రిం సుతహితయువతీసారసంసారతారం
తారుణ్యార్కారుణోష్ఠం నతసతతహితం చిత్రకృద్వేత్రితోత్రిం
వందే ... ... ... ... ... ... లక్ష్మీనృసింహమ్॥

౧౭

- కూర్మ -

స్వేచ్ఛాకూర్మావతారం భువనవిధినిమగ్నక్ష్మాభృద్వరేణ్య
ప్రోద్ధారోదారసారం సురదనుజగణప్రాప్తదివ్యామృతాన్న
ప్రేక్షాభిక్షప్రదానప్రణిహితకుహనామోహినీమోహవేషం
వందే ... ... ... ... ... ... లక్ష్మీనృసింహమ్॥

౧౮

- వరాహ -

హైరణ్యాక్షోగ్రరక్షఃశకలనజఠరభిద్భీశదంష్ట్రాదిఘోణ్యా
కారం భూభారవారం భుజగపరివృఢానల్పసాకల్పతల్పం
చాతుర్యాపారమేధాచతురసయుకళాధాత్రృజేగీయమానం
వందే ... ... ... ... ... లక్ష్మీనృసింహమ్॥

౧౯

- నారసింహ -

దీవ్యత్ఫుల్లవ్యన్మహోద్యన్నఖముఖవిదళద్విడ్వరాడ్దైత్యగర్భ
ప్రఖ్యాతస్ఫీతరక్తస్నపితరుచిలసన్మాలికాభీలకంఠం
కేయూరాబద్ధబాహుం నిరతవదనమద్దోషశోషన్మనీషం
వందే ... ... ... ... ... ....లక్ష్మీనృసింహమ్।

౨౦

- వామన -

ఖర్వాకారాంతస్వరూపం శమదమనియమబ్రహ్మచర్యాభిక్షాం
దేహచ్ఛాయాచ్ఛాదప్రసిద్ధస్వగుణశమితబల్యామిపాంథోతిగర్వం
స్థౌల్యం కల్యాణతుల్యం హారితసువసనం ధీరతాహార్యవర్యం
వందే... ... ... ... ... .... లక్ష్మీనృసింహమ్॥

౨౧

- పరశురామ -

భాషామోషాదిశేషస్మరదశరశరత్కాండముక్పాండుకీర్తిం
దీప్రప్రాంచత్ప్రతాపంశరపరశునికృత్తస్థిరాభృచ్ఛిరాళిం
రంగద్గంగాతరంగావిరళసరళతాభంగతుంగప్రసంగం
వందే..............................లక్ష్మీనృసింహమ్॥

౨౨

- శ్రీరామ -

ఈర్ష్యామర్షప్రబుద్ధం దశవదనశిరశ్ఛిద్ధనుస్త్రాణబాణం
పాదాంభోజాతధూళిప్రసరశుచికృతవ్యక్తమౌనీంద్రపత్నీం
దోశ్శుండాదండఖండీకృతగరళగళాఖండకోదండశౌండం
వందే..............................లక్ష్మీనృసింహమ్॥

౨౩

- బలరామ -

దోర్దండాఖండహాల్యుద్ధృతకరిసగరోద్ధామసీమాసమేతం
పాటీరేంద్వబ్జకంఠీరవధవళవపుష్కాంతిసౌలభ్యలభ్యం
బర్హిస్నిందాప్రద్యుష్టకాష్ఠాధిపవిమతివశాచ్ఛిత్రచిత్రావతారం
వందే..............................లక్ష్మీనృసింహమ్॥

౨౫

- శ్రీకృష్ణ -

మేఘామోఘప్రముక్తోపలహతవినుతాబాలగోపాలజాల
ప్రాణత్రాణప్రవీణోద్ధృతగిరివరగోవర్ధనత్త్వాన్మధరేంద్రం
మిత్రాబ్జామిత్రనేత్రద్వయ మభయనటత్కంసహింసావతంసం
వందే..................................లక్ష్మీనృసింహమ్॥

౨౬

- బుద్ధ -

బుద్ధాకారప్రసిద్ధం నియమమునివధూకృద్వ్రతేచ్ఛావరుద్ధం
పాతివ్రత్యాసురస్త్రీజనహృదయనవానంగబాణౌఘభంగం
సద్యశిఖద్యోతవిద్యోతమణిఘృణిగణాకీర్ణకోటీరకోటిం
వందే..................................లక్ష్మీనృసింహమ్॥

౨౭

- కల్కి -

కాంతారప్రాంతసంచారబలశబరసంఘాతఘాతాస్త్రశస్త్ర
వ్యాపారాశ్వోత్తమారోహణ మపరిమితానందకల్క్యావతారం
ప్రావృట్కాదప్రతీకం భవభయహరణం పాహి మాం సంతతార్తిం
వందే..................................లక్ష్మీనృసింహమ్॥

రాజచ్ఛ్రీచందుపట్లస్వనగరసమభాక్సౌధరాజాధివాసం
ఆచంద్రార్కప్రదీప్తం నయగుణవిలసద్రాఘవార్యప్రణీతం
నక్షత్రస్రక్సమాఖ్యాప్రచురమధురసవ్యాపితశ్లోకబృందం
వందేయాదక్షమాభృత్కటకపటుభుజారంహాలక్ష్మీనృసింహమ్॥



# తుక్కాపంచకము

శ్రీ అయ్యగారి నరసింహమూర్తి.

( సాహితీసమరాంగణసార్వభౌముఁడైన శ్రీకృష్ణదేవరాయల దేవేరులలో నొకర్తుక యని ప్రసిద్ధినిబడసిన 'తుక్కాదేవి' యోఢ్రప్రభు వగుగజపతితనయ. ఈమె యొకపరి పతిచేఁ దిరస్కరింపఁబడి భృంగవ్యపదేశమున ఆభూజానికిఁ బంపిన ధ్వన్యాత్మకములైన యీ మైదుశ్లోకములే 'తుక్కాపంచక మ'ను పేరుతో సారస్వతరంగమున నొకవిశిష్టస్థానము నాక్రమించినవి. )

క్రొత్తవిరులలోనఁ గ్రుమ్మరుభృంగమ్మ
గంధఫలినిఁ జేరఁ గాంక్షపడదు
రసికుఁ డళివరుండు; రమణీయ కేతకి
దాటరాని దొకటి దైవఘటన. 1

మోదుగా వ్రాలె తుమ్మెదమీఁ దటంచు
త్రుళ్ళఁబోకుము మాలతి దూరమాట
విరహ మోర్వక ప్రాణముల్ విడువనెంచి
వ్రాలె నీమీఁద నంగార భ్రాంతితోడ. 2

దిగ్దిగంతరములఁ దిరుగాడుభ్రమరమా!
జాజిఁబోలువిరిని జగతిలోనఁ
గనుట- పొందుట- తుది వినుటైన జరిగెనా
మాని పక్షపాతమతినిఁ దెలుపు. 3

వ్రాయవచ్చును నొకకొన్ని ప్రసవములను
చిత్రమందున చతురుఁ డౌచిత్రికుండు
పరిమళ విన్యాయ నేర్చునే విరులగమికి
తేంట్లువచ్చునే వానిలోఁ దేనెఁ ద్రావ. 4

భృంగమా! మాలతిని నన్ను భంగపఱచి
తుమ్మి చుంబింపఁబోయెదే ద్రిమ్మరీడ
పాదములు నాల్గు కల్గినపశువటండ్రు
ఆరు కాళ్ళున్ననిన్ను నేమనఁగవలయు. 5

ఓమ్

# శంకరపూజ్యపాద సంస్తుతిః

శ్రీ కాశరపర్తి కృష్ణకవిమూర్ధన్యః.

శ్లో. అద్వయబ్రహ్మవిద్యోపదేశామిత
ప్రౌఢధీశాలినే ఽజ్ఞానసంహారిణే
శంకరాచార్యవర్యాయ తే మే నమః
కాలటీనామకగ్రామసంవాసినే. ౧

తా. అద్వైతబ్రహ్మవిద్య నుపదేశించుటయందు మిగుల ప్రౌఢమైన బుద్ధిబలము గల్గినట్టియు, నజ్ఞానము నశింపజేయునట్టియు, కాలటియను నగ్రహారము నివాసముగా గలశంకరాచార్యస్వామికి నా నమస్కారము.

శ్లో. అహం నమామి శంకరాభిధాన ముత్తమోత్తమం
జగద్గురుం తురీయపావనాశ్రమాంతరే స్థితమ్
విరాగరాజితం ముముక్షుమానవప్రపూజితం
స్మరామి దుర్మతాతిఖండనే చణం సుధీనిధిమ్. ౨

తా. ఉత్తమోత్తముడును, జగద్గురుబిరుదాంకితుడును, సన్న్యాసాశ్రమస్థుడును, మిగుల విరాగియు, తీవ్రమోక్షేచ్ఛ గలజనులచే బూజింపబడువాడును, దుష్టమతముల మిగుల ఖండించుటయందు సమర్థుడును, మిక్కిలిబుద్ధిశాలియు, నగు శ్రీమచ్ఛంకరాచార్యనామధేయునకు నా నమస్కారము.

శ్లో. ఆర్యాంబాశివగురుజం
ప్రస్థానత్రితయభాష్యకర్తారమ్
స్థాపితచతుర్మఠం సొ
మ్యుద్ధారక మమలషణ్మతానాం త్వామ్. 3

తా. ఆర్యాంబ, శివగురు వనుదంపతుల పుత్త్రుడును, దశోప నిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత యనుప్రస్థానత్రయము నకు భాష్యముల రచించినట్టియు, భారతదేశమున నాలుగద్వైత మహామఠముల స్థాపించినట్టియు, షణ్మతోద్ధారకు డైనట్టిశంకర స్వామికి నా వందనములు.

శ్లో. కదాచి త్సుకర్మాణి ముక్తాని బౌద్ధై
ర్మనశ్శుద్ధికారీణి వేదోదితాని
కృతం ముక్తికృజ్ఞానవాశం చ కైశ్చి
త్త్వయా భో విభో! తద్ద్వయం రక్షితం హి. ౪

తా. బుద్ధశిష్యులచే నొకానొక కాలమున చిత్తశుద్ధిని గల్గించు వేదోక్తసత్కర్మములు నాశన మొనరింపబడినవి. అటుపిదప భాట్ట ప్రాభాకరాదులచే మోక్షప్రద మగుజ్ఞానము నశింపజేయబడినది. ఓ మహాత్మా! నీచే నా సత్కర్మజ్ఞానములు రెండును రక్షింపబడినవి గదా!

శ్లో, వసిష్ఠ స్తత్సుత శ్శక్తి
శ్శక్తేః పుత్రః పరాశరః
పరాశరాత్మజో వ్యాసో
వ్యాసస్య తనయ శ్శుకః. ౫

శ్లో శుకశిష్యో గౌడపాద
స్తస్యాంతేవాసిస త్తమో
గోవిందభగవత్పాద
స్స గురు స్తవ శంకర! ౬

తా. వసిష్ఠమహర్షి తనయుడు శక్తి. అతనికుమారుడు పరాశరుడు. అతని పుత్రుడు వ్యాసభగవానుడు. అతని సుతుడు శుకమౌని. ఆ శుకుని శిష్యుడు గౌడపాదాచార్యుడు. అతనిశిష్యుడు గోవిందభగవత్పాదుడు. ఓ శంకరప్రభూ! ఆ గోవిందభగవత్పాదుడే మీ గురువర్యుడు గదా.

శ్లో. సురేశ్వరః పద్మపాదో
హస్తామలకతోటకౌ
త వాంతేవాసిన స్సర్వే
జ్ఞానినః ఖలు భో విభో! ౭

తా. సురేశ్వరుడు, పద్మపాదుడు, హస్తామలకుడు, తోటకుడు నను నల్వురును నీ ప్రియశిష్యులు. ఓ ప్రభూ! వీర లెల్ల పరిపూర్ణ జ్ఞానులు గదా.

శ్లో. భవతా రచితాః కృతయో నితరాం
పఠితా గళితాజ్ఞతయా విదితా
మమ నిర్గుణ తాఖిల తాద్వయతా
కరుణావరుణాలయ! పాలయ మామ్. ౮

తా. ఓ దయాసముద్రుడా! నీచే రచింపబడిన యద్వైతవేదాన్త గ్రంథములెల్ల నిత్యమును నాచే బఠింపబడుచున్నవి. వానివలన నా యజ్ఞానము నశించి నా నిర్గుణత్వము, సర్వపరిపూర్ణత్వము, నేకత్వము తెలియబడినది. మహాత్మా! నన్ను రక్షింపుము.

శ్లో. భవతా రచితోపనిషద్దశకాం
తర భాసుర భావచయం నితరామ్
మమ సద్గురుణా పరిబోధితవాన్
శ్రవణం మననం కరవాణి సదా. ౯

తా. మహాత్మా! నీచే విరచింపబడిన దశోపనిషత్తులందలి భావ మెల్ల మా గురువర్యులవలన నేనుపదేశింపబడి దానిని నిరంతర మును శ్రవణమననములు గావించుకొనుచున్నాడను.

శ్లో. నిరాకారసాకారవస్త్వా న్యవస్థా
త్రయస్థా న్యహంకారజీవేన సాకం
త్వయా దర్శితా న్యేవ సాక్షీ తత స్త్వం
పరివా చ్యేతి జీవేశ్వరై క్యం కరోషి. ౧౦

తా. జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి యను మూడవస్థల లోని సాకారనిరాకారవస్తువు లహంకారజీవసహితముగ నీచే జూప బడినవి. వానికెల్ల సాక్షివి నీవే యని వచించి జీవేశ్వరుల కేకత్వ ముప దేశించితివి.

శ్లో. మనోనేత్రహీనో నిరాకారవాన్ త్వం
జగ చ్చాపి మిథ్యా, కథం దృశ్యతే తత్
తురీయో ఽపి న త్వం న కర్తా న సాక్షీ
భవా నేవ భూమే త్యహం బోధితో హి, ౧౧

తా. నీవు నిరాకారుడ వగుటచే మనస్సు, నయనములును లేని వాడవు. అవస్థాత్రయ మగుత్రిజగంబులును మిథ్యలే. కావున నీ వెట్లు లేనిజగంబుల లేనికనులతో, మనసుతో జూడగలవు? మూడులోకంబు లును మిథ్య లగుటచే నీవు తురీయుడవు గావు. మనోనేత్రశూన్యుడ వగునిరాకారుడవు కావున సాక్షివి, కర్తవును గూడ కావు.నీవు భూమవే యని నాకు బోధించితివి.

శ్లో. భిన్నత్వం దృగ్దృశ్యయో ర్ద్రష్ట్ర స్స జీవీ
దేహః ప్రాణో మానసం దృశ్య మేవ
తేషాం ధర్మా జన్మమృత్యూ పిపాసా
క్షుత్ ధీ ర్హ్రీ ర్భీ స్సంతి; నో బ్రహ్మణో మే. ౧౨

తా॥ దృక్కు వేరు, దృశ్యము వేరు. జీవుడు దృక్కు— దేహము ప్రాణము, మానసమును దృశ్యములే. వానిలో జననమరణములు శరీరధర్మములు–ఆకలిదప్పికలు ప్రాణధర్మములు. బుద్ధి, లజ్జ, భయము మొదలగునవి మనోధర్మములు; నీవు మిథ్య లగువీని కెల్ల బరుడవగు బ్రహ్మశబ్దవాచ్యుడ వని నీచే నేను బోధింపబడితిని.

శ్లో॥ పూర్ణ ఏకో౽ స్మ్యహం బ్రహ్మశబ్దాంచితో
నిర్గుణో నిష్క్రియో నిశ్చలో నిర్మలో
వ్యాపకో౽ నామకో౽ రూపకో౽ నల్పక
శ్శంకరస్వామిపాదాంతికాసేవనాత్. ౧౩

తా॥ శ్రీశంకరభగవత్పాదుల వేదాంతబోధల సేవించుటచే నేను సర్వపరిపూర్ణుడను, నద్వితీయుడను, బ్రహ్మశబ్దాంచితుడను. గుణరహితుడను, నకర్తను, నచలుడను, మలరహితుడను, సర్వ వ్యాపకుడను, నామరూపవిహీనుడను, నధికుడను.

శ్లో॥ జీవో౽హంయు ర్మోక్షబంధా వుపైతి
జ్ఞానాజ్ఞానే ప్రావ్య మిథ్యాజగత్స్న
నీరూపస్య బ్రహ్మణ స్తే న తౌ ద్వా.
వి త్యస్త్యేవ గ్రంథరాజే త్వదీయే. ౧౪

తా॥ మిథ్యాజగదంతర్గతు డగు సహంకారజీవుడు జ్ఞానముచే ముక్తిని, నజ్ఞానముచే బంధమును బొందుచున్నాడు. నిరాకారత గల పరబ్రహ్మ మగునీకు జ్ఞానాజ్ఞానబంధమోక్షము లేనేలే వని నీ గ్రంథ రాజము వాచించుచున్నది.

శ్లో॥ "శంకర శ్శంకర స్సాక్షా"
దితి స్తౌతి ప్రజావళిః
భవార్తిసంహార! స్వామిన్!
భవాన్ సార్థకనామకః, ౧౫

తా॥ ఓ స్వామీ! శంకరనామాంకితుడ వగునీవు శంకరుడవే యని సమస్తమానవసమూహము స్తుతించుచున్నది. నీవు భవదుఃఖ సంహారివి గావున సార్థకనామధేయుడవే.

శ్లో॥ కరోమి తే విగ్రహపాదపూజాం
స్మరామి తే పావనశంకరాఖ్యాం
తరామి సాంసారికవారిరాశిం
చరామి లోకే నితరాం యథేచ్ఛమ్. ౧౬

తా॥ మహాత్మా! నేను నీ విగ్రహపాదముల పూజల గావించుచుంటిని. పవిత్ర మగు నీశంకరనామధేయమును స్మరించుచుంటిని. సంసారమహాసముద్రమును దాటుచుంటిని. జగమున నెల్లవేళల స్వేచ్ఛగా సంచరించుచుంటిని.

ఓం తత్సత్ -



# అన్నవర సత్యనారాయణస్వామి స్తుతిః

శ్రీ కాకరపర్తి కృష్ణకవి మూర్ధన్యః.

శ్లో॥ కౌసుమోద్వాసనా భాసితా నేకభూ
జావృతే పర్వతాగ్రే స్థితా యాలయే
సత్యవత్యాఖ్యజాయాద్వితీయాయ తే
మే నమ స్సత్యనారాయణస్వామినే. ౧

తా॥ అమితమగు పుష్పపరిమళముగల వృక్షములచే నావరింపబడిన పర్వతముయొక్క పైభాగమున గల యాలయమున సత్యవతీ దేవి యను భార్యతోఁ గూడి నివసించియున్న సత్యనారాయణస్వామి యను మీకు నా నమస్కారము.

శ్లో॥ నారాసారాత్మ సంసారా, పారబాధానివారణమ్
కర్తు మన్నవరగ్రామే, భవా నవతర స్యహో॥ ౨

తా॥ ఆహా! మానవుల సారహీన మగు సంసారములందలి మహాదుఃఖముల నివారించుటకై యన్నవర మను గ్రామమున నీవవతరించియున్నాఁడవు.

శ్లో॥ హరిహరభగవద్విభేదబుద్ధ్యా
వికలితమానవమానసప్రశాంత్యై
శివ మపి భవదీయసన్నిధానే
నివసిత మత్ర కరోషి. భో విభో! త్వమ్. ౩

తా॥ హరిహరభేదబుద్ధిగలిగి, వికలత్వమందిన మానవులయొక్క మనశ్శాంతికై యీశ్వరదేవునిఁగూడ నీసన్నిధానమున స్థిరముగ నో ప్రభూ! నీవు నిల్పుకొంటివి.

శ్లో॥ తావకీనే సన్నిధానే. వివాహాది శుభోత్సవాః
క్రియంతే లక్షాతిలక్షా, యత స్త్వద్రక్షకో భవాన్. ౪

తా॥ మహాత్మా! నీవు శాశ్వతరక్షకుడవు గావుననే లక్షల కొలది వివాహాదిశుభోత్సవములు నీసన్నిధానమున నాచరింపబడు చున్నవి.

శ్లో॥ నిశాయాం తు పంపాపగాచారుతీరే
మహాత్మన్! సదారో విహారం కరోషి.
త్వదీయాః పదద్వంద్వయుగ్మాచ్ఛరేఖాః
దివాదర్శితాః పూజితా భక్తవర్యైః. ౫

తా॥ మహాత్మా! రాత్రులయందు మనోహరమగు పంపానదీ తీరమున నీభార్యయగు సత్యవతీదేవితో గూడి విహరించుచుందువు. ఆమఱునాటి యుదయమున నదీస్నానార్థ మేతెంచిన భక్తులచే తీర భూమిపై గోచరించు మీదంపతుల పాదశుభరేఖలు పూజింపబడు చున్నవి.

శ్లో॥ రుచ్యాతిరుచ్యం మధురం త్వదీయం
భక్తై రభక్తై రపి వాంఛనీయం
మన స్తనుః పుష్టికరం ప్రసాదం
ప్రసీద మే నిత్యదయామయాత్మన్! ౬

తా॥ ఓ నిత్యదయామయా! మిగుల రుచికర మైనట్టియు, నీ భక్తులచేతను, భక్తులుగాని వారలచేతనుగూడ గోరబడుచున్నట్టియు, మానసమునకు, శరీరమునకునుగూడ మిగుల పుష్టిని గలుగజేయు తీయని నీప్రసాదమును నా కనుగ్రహింపుము.

శ్లో॥ నృపాలో రమాయాః, కవి శ్శారదాయాః
కృపాం యాతి; నైకో ద్వి దేవీదయాప్తిం
త్వయా దత్తవిత్తా ద్రిమాసత్కృపావాన్
కవీశో నమస్తే నమస్తే నమస్తే.

తా॥ లక్ష్మీకటాక్షమును ప్రభువును, సరస్వతీకటాక్షమును కవీంద్రుడును పొందుదురు గాని యొక్కనికే లక్ష్మీసరస్వతీ కటాక్షముభయమును గలుగదు. ప్రతివత్సరమున నీ విడుధనముచే కవీంద్రుడు సరస్వతీ కృపతో బాటుగ లక్ష్మీకటాక్షమును గూడ ననుభవించు చున్నాడు. ఓమహానుభావా! నీకు నా నమస్కారము. నా నమస్కారము. నా నమస్కారము.

శ్లో॥ సకామనిష్కామకర్మా చరణా చ్చంచలం మనః
బుద్ధి ర్భూత్వా, జ్ఞాన మేత్య, భక్తం ముక్తం కరిష్యతి. ౭

తా॥ చంచలస్వభావముగల మనస్సు సకామనిష్కామ సత్కర్మము లాచరించుటచే నది నిశ్చలమగు బుద్ధిగ మారి, విచారణాచరణమువలన జ్ఞానము నంది నీభక్తుడు క్రమగతి జీవన్ముక్తు డగు చున్నాడు.

శ్లో॥ ధ్యాత్వా త్వాం పరిపూజ్య నిశ్చలమనా భక్తో భవే ద్బుద్ధిమాన్
ధీమాన్ భూరివిచారణేన జగతాం మిథ్యాత్వవిజ్ఞానవాన్
భూత్వాత్మీయనిరాకృతిం చ పరిపూర్ణత్వం క్రియాహీనతా
మేకత్వం సమవాప్య భూమ్ని భవతి స్వామిన్! విలీనో భవేత్. ౮

తా॥ స్వామీ! నీభక్తుడు నిశ్చల మగుమనసుతో నిన్ను పూజించి, ధ్యానించి బుద్ధిమంతుడై, యమితమగు సదసద్విచారణము వలన ప్రపంచముయొక్క మిథ్యాత్వమును, తన నిరాకారత పరిపూ

ర్ణత, సకర్తృత్వము, నేకత్వమును గ్రహించి, భూమ వగు నీయందు గలిసి పోవుచున్నాడు.

శ్లో॥ సాంసారికసుఖం జీవ, న్ముక్తిం యాంతి దయామయ !
సత్యనారాయణస్వామిన్! జనా స్తావక సేవయా. ౧౦

తా॥ కృపాకరుడ వగు నో సత్యనారాయణస్వామీ! మానవులు నిన్ను సేవించుటచే సంసారమున సౌఖ్యమును, జీవన్ముక్తిని బడయు చున్నారు.

శ్లో॥ త్వదీయం ప్రసాదం సమాగమ్య భోక్తుం
భవద్విగ్రహారాధనం వాంఛితార్థం
విర చ్యాజ్ఞనారం ఫలం ప్రాప్య యాతి
క్రమాత్ జ్ఞానశక్తిం తతో నిత్యముక్తిమ్. ౧౧

తా॥ అజ్ఞానముగల మానవసమూహము మధురమగు నీప్రసాదమును భుజించుటకై యేతెంచి, తమకోరికలు నెరవేరుటకై నీవిగ్రహారాధన మాచరించి, ఫలితము నంది, క్రమముగ జ్ఞానశక్తి నంది, దాని వలన నిత్యముక్తి బడయుచున్నది.

శ్లో॥ పూజాక్రమ స్తే పరమం పవిత్రః
కథావిధానం తవ భక్తపాళేః
మనోహర స్తావకసుప్రసాదో
మాధుర్యధుర్యో భగవన్! నమ స్తే. ౧౨

తా॥ ఓభగవానుడా! నమస్కారము. నీపూజాక్రమము మిగుల పవిత్రమైనది. నీకథావిధానము భక్తజనసమూహమునకు మనోహరమైనది. నీప్రసాద మమితమధుర మైనది.

శ్లో॥ సత్యం భవా నేవ యత స్త్వ మాత్మా
యతోఽయనం తే నరవారచిత్తం
నారాయణ స్త్వం ద్వయమేళనాద్ధి
త్వం సత్యనారాయణనామధారీ. ౧౩

తా॥ మహాత్మా! నీవు (ఆత్మ) పరబ్రహ్మమవు కావున సత్య మవు. నరసమూహమానసము నీకు స్థానము గావున నీవు నారాయణుండవు. రెండును గలియుటచే నీవు సత్యనారాయణు డను నామమును ధరించితివి.

(శ్రు॥ సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, నరాణాం సమూహం నారమ్, నారం అయనం యస్య స నారాయణః)

శ్లో॥ సనామరూపం జగతాం త్రియం చ
నీరూపనామాంచిత ఏక ఆత్మా
ద్వా వేక మేవేతి కరోతి బోధాం
తే సత్యనారాయణనామధేయమ్. ౧౪

తా॥ నామరూపములు గల మూడులోకములును, నామరూప ములు లేని యద్వయ బ్రహ్మమును నేకైక వస్తువే యనెడు యథార్థ మగు బోధను సత్యనారాయణు డను నీ నామము గావించుచున్నది.

శ్లో॥ పఠంతి పద్యాన్ కవయః స్తవం తే
కుర్వంతి భక్తా శ్చతురాగమాళిం
గాయంతి విప్రా నితరాం తదీయ
ప్రతిధ్వని ర్వ్యాప్తి ముపైతి నిత్యమ్. ౧౫

తా॥ కవు లెల్లరును నిన్ను గూర్చి పద్యములు రచించి పఠించు చున్నారు. భక్తు లందఱును నిన్ను స్తుతి జేయుచున్నారు. వేదవిదు లగు బ్రాహ్మణు లెల్లరును నాలుగు వేదముల జదువుచున్నారు. నిత్య మును నాయా కృత్యముల ప్రతిధ్వని యెల్లెడ వ్యాప్తి నందుచున్నది.

శ్లో॥ కృష్ణశాస్త్రీ లేఖకోఽహం
రచయిత్రీ సరస్వతీ
వృద్ధోఽహం కిం కరిష్యామి
శ్లోకాన్ స్వీకురు భోవిభో ! ౧౫

తా॥ సరస్వతీదేవి యీ శ్లోకము లెల్ల రచించినది. కృష్ణశాస్త్రి నామాంకితుడ నగు నేను లేఖకుడను మాత్రమే. వృద్ధుడనగు నే నివు డేమి చేయగలను ? ఓ సత్యనారాయణప్రభూ ! ఈ శ్లోకము లెల్ల దయతో స్వీకరింపుము.



# సంకుసాల నృసింహకవి

—శ్రీ ఉకుమళ్ల కామేశ్వరరావు, బి. ఏ., బి. ఇడి.

## 1. ఇంటిపేరు

కవికర్ణరసాయనము లేక మాంధాతృచరిత్ర మను తెలుగుకావ్య మున్నది. దానికర్త నృసింహకవి యనువిషయము అగ్రంథముయొక్క గద్యనుండియు, మఱిరెండుపద్యముల (పీఠిక-7, 6-218) నుండియు తెలియుచున్నది. అంతకుమించి ఆ కవియొక్క గోత్రముకాని, వంశము కాని, తలిదండ్రులు గాని, స్వస్థలము గాని, చివరకు ఇంటిపేరు గాని ఆగ్రంథమునుండి తెలియుటలేదు. అంతటివిచిత్రరచన యది. దాని కంతకును కారణము కవియొక్కపద్ధతియే యనువిషయమును ముందు ముందు చూచెదము. అయితే కవిచరిత్రరచయిత లూరుకొనలేదు. అతనికి సంకుసాలనృసింహకవి యనిపేరు పెట్టిరి. ఇంటిపేరు ఆకావ్యములో లేదు. కాబట్టి ఆదిలోనె తఖ రేర్పడినది. ఇంక అతనియింటిపేరు సంకుసాలా లేక సుంకసాలా లేక మఱియొకటా? మానవల్లి రామకృష్ణకవిగారు [1] ప్రబంధమణిభూషణ మను సంకలితగ్రంథమునకు పీఠికను గూర్చుచు (పుట 5) నృసింహకవియింటిపేరు సుంకసాల యని తెలిపిరి. ఇతరవిమర్శకులు లేక రచయితలు అతనియింటిపేరు నెట్లు పేర్కొనిరో చూచెదము.

కాకునూరి అప్పకవి (క్రీ.శ. 1656) అప్పకవీయములో (అ3-295 319) కవికర్ణరసాయనములోని రెండుపద్యముల నుదహరించినాడు, కాని కవిపేరును చెప్పలేదు. అడిదము సూరకవి (1720-85) కవిసంశయవిచ్ఛేద మనులక్షణగ్రంథములో (ప్రి-37) సింగసాళ్ల నరసింగన్నయొక్క కవికర్ణరసాయనములోనిపద్యము లని రెండుపద్యముల నుదాహరణలుగా నిచ్చెను.

---

1 ప్రబంధమణి భూషణమును మానవల్లి రామకృష్ణకవిగారు 1910 లో అచ్చు వేసిరి.

కూచిమంచి తిమ్మకవి (1700–1757) సర్వలక్షణసారసంగ్రహ ములో కవిపేరు తెలుపక, కవికర్ణరసాయనములోని పెక్కుపద్యముల నుదహరించినారు. బ్రౌణ్యనిఘంటువులో (1852) పుస్తకము పేరేకాని కవిపేరు చెప్పఁబడలేదు. వెనమండ్రం వెంకటరామయ్య 1879లో పురాణనామచంద్రిక యను చిన్నవిజ్ఞానకోశము నచ్చువేసెను. దానిలో నాకవి పేరునేకాని యింటిపేరును పేర్కొనలేదు. గురుజాడ శ్రీరామ మూర్తిగారు కవిజీవితములలో (1893) ఆకవియింటిపేరు సంకుసాల యని వ్రాసిరి. కందుకూరి వీరేశలింగకవి ఆంధ్రకవులచరిత్రలో(1899) గూడ నట్లే వ్రాసెను. అతనియింటిపేరు [2] సుంకుసాల, సింగనాళ్ల, టంకసాల అని వివిధములుగాఁ జెప్పఁబడుచున్నది. అట్లతనియింటిపే రైనను స్పష్టముగా తెలియకపోవుటకు కవియే కారణము. అతడు స్వబుద్ధిగానె చిక్కులు తెచ్చిపెట్టినా డనువిషయము అతనిదైన యీ క్రిందిపద్యము స్పష్టపఱచుచున్నది.

క. నేరిచిన సుకవి, కృతిచేఁ
బేరెత్తిఁగించుకొని, జగతి పెంపగు టొప్పన్,
నేరక కృతిఁ జెప్పుట తన
నేరమి, యపకీర్తి జగతి నిలుపుటగాదే! (పీఠిక 11)

అట్టియాశయమె ప్రస్తుతసమస్యలకు కారణమైనది. కవికాలము మఱియొకసమస్య. అతనిపేరైనను పరిశోధింపనక్కరలేకుండ తెలియు చున్న దని మనము కృతజ్ఞతను జూపవలసియున్నదిగదా !

## 2. అల్లారుముద్దుతనము

కవికర్ణరసాయనము అల్లారుముద్దుగ్రంథముగాని మూలబడి యున్నది కాదు. కృష్ణదేవరాయలతో సంబంధించినమైథిల్యామును ప్రస్తుతము విడిచెదము. రామవాచకము (క్రీ.శ.1530ప్రాంతము)లో

2. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తక భాండాగారము, ద్వి. భా. పు. 69

91వ పుటలో కవిపేరు, కావ్యము పేరు చెప్పక, కవికర్ణరసాయనము లోని (2-65, 66) రెండుపద్యము లుట్టంకింపఁబడినవి. అప్పకవీయములో (3-296, 319) రెండుపద్యము లుదహరింపఁబడినవి. క్రీ. శ. 1700 ప్రాంతవుది యగువ్రబంధమణిభూషణములో పదమూడుపద్యము లుట్టంకింపఁబడినవి. అవి యీగ్రంథవ్రిచారమును ఋజువువరచుచున్నవి.

## 3. కవికాలము

తగినన్ని యాధారములు లేకపోవుటచేత నృసింహకవికాలనిర్ణయము కష్టతర మగుచున్నది. అయితే యున్నయాధారములతోనె యొకతీర్మానమునకు రావలసియున్నది కదా!

తనకవిత్వములో వీరవైష్ణవమును జొప్పించిననృసింహకవి, తనకు పూర్వ మున్న మహాకవులను కవిస్తుతిలో పేర్కొనలేదు. ఆ గతియే యతనికిఁగూడ పట్టినది. ఎవ్వరును ఆమహాకవి పేరును తమకవిస్తుతిలోఁ బేర్కొన్నట్లు కనఁబడదు. దానికి నతనివీరవైష్ణవలక్షణము ముఖ్యకారణము గావచ్చును.

కవికాలనిర్ణయమునకు లక్షణగ్రంథములలోని యుదాహృతపద్యములు తోడ్పడును. కాని ప్రాచీనలక్షణగ్రంథములు కొన్ని యింకను అచ్చుకాలేదు.

తెనాలిరామలింగకవి యీక్రిందిపద్యమును జెప్పినాడు-

క. చిన్నన్న ద్విపద కెరఁగును
వన్నుగఁ బెదతిరుమలన్న పదమున కెరఁగున్
మిన్నంది మొరసె నరసిం
గన్నకవిత్వంబు పద్యగద్యశ్రేణిన్.

ఆపద్యములోఁ జెప్పంబడిన నరసింగన్నయే సంకుసాలనృసింహకవి యని కొందఱనుచున్నారు. కాని అది యెట్లగును? ఆపద్యము

తాళ్లపాకకుటుంబమునుగుఱించి చెప్పఁబడినది, కాని యితరులనుగుఱించి కాదు. దానిలోని ముగ్గురకవు లెవ్వ రనగా— తాళ్ళపాక అన్నమయ్యకు (క్రీ. శ. 1408–1503) ఇద్దఱు భార్యలు. పెద్దామెపేరు తిరుమలమ్మ. ఆమెకుమారుఁడు నరసింగన్న. (పెద్దభార్య చనిపోగా అన్నమయ్య అక్కమ్మ యనునామెను పెండ్లియాడినాడు). ఆమెకుమారులలో నొకఁడు పెదతిరుమలయ్య (1460–1546). అతనికుమారుఁడు చిన్నన్న (1498–1561) ఆముగ్గురిపేర్లును పైపద్యములో నున్నవి. కాఁబట్టి పై పద్యమునకును నృసింహకవికిని ఎట్టిసంబంధమును లేదు. అయితే నరసింగన్నరచన లిప్పటివఱకును బైటపడలేదు.

రాయవాచకములో (1530), అప్పకవీయములో (1656) కవికర్ణరసాయమునుండి పద్యము లుదహరింపఁబడినవి కదా. కాబట్టి యాకావ్యము క్రీ. శ. 1830కు పూర్వవు దని నిశ్చయ మగుచున్నది. అయితే యెంతపూర్వుపుది? [3] శ్రీకృష్ణదేవరాయలు నృసింహకవి కవిత్వము నడుగడుగున ననుసరించి యాముక్తమాల్యదను రచించినాఁడని సంప్రదాయముగా వచ్చుచున్న తీర్మానము. ఆవిషయము పద్యములనుండి విశద మగుచున్నది. రాజులను పిశాచములు, శవము లని తిట్టినవానికవిత్వమును రాయ లనుసరించుట చిత్రముగా గనఁబడక మానదు. ఆవీరవైష్ణవునికవిత్వ మీవీరవైష్ణవరాజకవికి బాగుగా నచ్చినది. కవితాశక్తిలో నరసింహకవి యసాధ్యుఁడు కదా! రాయలికి నరసింహకవి సమకాలికుఁ డైనచో నట్టిమెచ్చుకోలుకు, అనుకరణకు నవకాశ ముండదు. కాఁబట్టి ఆమహారాజున కామహాకవి పూర్వుఁడని భావింపవచ్చును. కాలవ్యత్యాసము శతాబ్దములమీదనె యుండవచ్చును. నృసింహకవిమీద నామహారాజునకు గలప్రియమునుబట్టియే మోహనాంగి యనుకూఁతురిపేరితో గలవిచిత్రకథ పుట్టియుండును.

3. గురుజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములలో కృష్ణదేవరాయలను గుఱించియున్న వ్యాసము.

తా నెంతయనుసరించినను రాయలు ఆముక్తమాల్యదలో నృసింహకవి పేరును పేర్కొనలేదు. అది రాజలక్షణము కాఁబోలు !

నృసింహకవి శ్రీనాథమహాకవికిఁ బిమ్మట పుట్టినచో, నాతని రచనలో నటుతర్వాతిమహాకవుల పద్యలక్షణములు కొంతవఱకైన గనఁబడును. అట్టిది లేకపోవుటచేత నాతఁడు వారందఱకును ముందు వాఁడై యుండు నని స్థూలముగా తలపవచ్చును.

ఆమహాకవికాలనిర్ణయమునకు మఱికొన్నిచిన్నసాధన లున్నవి. అతఁడు పుష్పాపచయమును రగడలోఁగాక పద్యములలోవర్ణించి పెండ్లి కుమారుని కిచ్చినయరణపువస్తువులను రగడలోఁ జెప్పినాఁడు. కాఁబట్టి యతనికావ్యము, విలాసపరిబంధములలో పుష్పాపచయమును రగడలో వ్రాయుసంప్రదాయమునకు (1500) పూర్వమె పుట్టిన దనవచ్చును.

నృసింహకవి కవిత్వములో అన్యదేశ్యములు అనగా తురకపద ములు కనఁబడవు. కాఁబట్టి అతనిరచన మనభాష మహమ్మదీయభాషా పరిభావమునకు లోనుగాకపూర్వమె చేయఁబడిన దనవచ్చును.

కవియే చెప్పిన యొకయంశమునుండి యతనికాలనిర్ణయమును చేయఁ బ్రయత్నించెదము.

## 4. భట్టపరాశరుఁ డెవఁడు ?

నృసింహకవి తాను భట్టపరాశరుని శిష్యుఁడ నని యిట్లు చెప్పు కొన్నాడు- "ఇది శ్రీమద్భట్టపరాశర దేశికేంద్రచరణసరసీరుహాసేవ కోపసేవకనరసింహనామధేయప్రణీతం బైన-" (గద్యము)

క. గురువరభట్టపరాశర
చరణసరోరుహసముల్లసన్మానసుడన్
నరసింహనామధేయుఁడ
పరిచితసత్కృతిరసానుభవ[4]హేతువునన్. (పీఠిక 7)

4. 'హేతువుఁనన్' అనుపాఠము తప్పుగానుండుటచేత శ్రీ కొమర్రాజు? అచ్యుతరావు గారు తమప్రతిలో 'దీపితుఁడన్' అని దిద్దినారు.

కవి పేర్కొన్నభట్టపరాశరుఁ డెవ్వఁడు ? అతనినిగుఱించి రెండుసిద్ధాంతములున్నవి- 1. విశిష్టాద్వైతమతప్రచారమును జేసిన వేదాంత దేశికుని (పదునాల్గవశతాబ్దము) శిష్యుఁ డైనభట్టపరాశరుఁ డని [5]రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు పలికిరి. [6]చాగంటి శేషయ్యగారియభిప్రాయము వేఱుగా నున్నది. అది యేమనగా- భట్టపరాశరులు ఫుష్కలముగా నున్నారు; క్రీ.శ. 1457 నాటిశాసనములోని హారితసగోత్రుఁ డైనభట్టపరాశరుఁడె నృసింహకవియొక్క గురువు కావచ్చును. అట్లు ఆయిద్దఱి విమర్శకులతోవలును భిన్నముగా నున్నవి. కాఁబట్టి యీపరాశరుఁ డెవ్వఁడో స్థిరపరుపవలసియున్నది. దానికి ముందుగా నరసింహకవి నుండి యంకితము పొందిన శ్రీరంగనాథస్వామిని- కావేరీనదిమధ్య శ్రీరంగములో నున్న దేవుని గుఱించి చూచెదము.

ఢిల్లీసుల్తాన్ అయినఅల్లాఉద్దీన్ ఖిల్జీకి దక్షిణహిందూదేశమును కబళింపవలె ననుసంకల్పము కలిగినది. అతఁడు మలీక్ కాఫరు అను సేనానాయకునకు గొప్పసేన నిచ్చి యాశీర్వదించి పంపెను. అతఁడు క్రీ.శ. 1310 లో ద్వారసముద్రము, శ్రీరంగము, మధుర మొదలైన స్థలములను దుమ్ముచేయుచు రామేశ్వరమునకుఁ బోయెను. ఆదండయాత్రలో శ్రీరంగనాథస్వామి దేవాలయము ధ్వంసమైనది. కాని కొందఱు భక్తులు [8]శ్రీరంగదేవుని విగ్రహమునుఁ గాపాడ దలచుకొన్నారు.

సుదర్శనాచార్యుఁడు పండితుఁడు, వీరవైష్ణవభక్తుఁడు. అతఁడు రామానుజాచార్యుని దగు నొకవీరవైష్ణవగ్రంథమునకు శ్రుతప్రకా

5. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం 6 సం 6, 7 పు 271
6. ఆంధ్రకవి తరంగిణి (చాగంటి శేషయ్యగారికృతము) సం 8-235
7. తిరుపతి దే శా సం 4-73 (ఆంధ్రకవితరంగిణి, సం 8-239)
8. ఆంధ్రులచరిత్ర (చిలుకూరి వీరభద్రరావుకృతము) 1916 మూ. భా. పు 335-37. (శ్రీరంగదేవుని సంబంధమైన ఆకాలపు చరిత్ర).

శిక యను వ్యాఖ్యను తయారుచేసెను. అతనికి నిద్దఱుపుత్రిలు-ఉద్దండ భట్టరు, పరాశరభట్టరు అనువారు. సుదర్శనాచార్యుని శిష్యరత్నము వేదాంత దేశికుఁడు. రంగనాథుని గుడిమీదికి మాలిక్ కాఫర్ చేసిన దాడిలో దెబ్బలు తిని సుదర్శనాచార్యుఁడు మరణించుచు, తాను వ్రాసినగ్రంథమును, తన యిద్దఱిబిడ్డలను, శిష్యుఁడైన దేశికునిచేతులలోఁ బెట్టి, కాపాడు మని ప్రార్థించెను. అంతట వేదాంత దేశికుఁడు శ్రీరంగ దేవునివిగ్రహముతో, వ్యాఖ్యతో, బిడ్డలతో క్రమముగా తిరుపతిని చేరుకొనెను. అట్లు తిరుపతి దేవాలయములో రంగనాథుని విగ్రహము రక్షింపఁబడినది.

[9]వేదాంత దేశికుని స్వస్థలము కంచి. అతనిపుట్టుక క్రీ. శ. 1268 అతఁడు నూటరెండుసంవత్సరములు జీవించినాఁడు. అతనిశిష్యుఁడైన భట్టపరాశరునకు (సుదర్శనాచార్యుని పుత్రుఁడు,క్రీ. శ. 1310 కి పది సంవత్సరములవయ స్సని భావింపవచ్చును.

1336 లో విద్యారణ్యస్వామియొక్క యుత్తమదర్శకత్వమున విజయనగరరాజ్యము క్రమముగా వృద్ధి చెందుచున్నది. ద్రవిడదేశమున మధుర నాక్రమించుకొని పరిపాలించుచున్న మహమ్మదీయసుల్తాన్‌ను వెడలగొట్టవలసియున్నది. విజయనగరప్రభు వగుబుక్కరాయుని కొడు కగుకుమారకంపరాయఁడు (క్రీ.శ. 1361-75) ఆ కార్యమునకుఁ బూనుకొనెను. అతనియొక్క ప్రసిద్ధసేనాధిపతులలో బ్రాహ్మణుఁడైన [10]గోపన్నయు, క్షత్రియుఁడైన సాళ్వమంగును గలరు. వీరి సాహసచర్యలను తెలుసుకొనుటకుముందుగా మఱికొన్నిసంగతులను జూడవలసియున్నది.

9. ఆ. సా. ప. ష. సం 6.6. 7-672.

10. రెడ్డిరాజైన అన వేమారెడ్డికి (1362-2380) అప్పయ గోపయ దేశాపట్ల సంగ్రామ సముద్రంత బిరుదున్నది. దానిలోఁజెప్పఁబడిన గోపయ యితఁడే కా!

[11]వేదాంత దేశికుఁడు కంచినుండి విద్యారణ్యునితో మతసిద్ధాంత విషయ మైనచర్చను లేఖలద్వారా చేయుచుండెను. వేదాంత దేశికుని పాండిత్యమును గమనించి విద్యారణ్యుఁడు (క్రీ. శ. 1302–1387) వేదాంత దేశికుని విజయనగరమునకు వచ్చి సుఖముగా కాలక్షేపము చేయ మని కోరెను.

ఆనాటివిజయనగరపరిపాలకుఁడు హరిహరరాయలు (1336–1355). అతని యాస్థానకవులలో నొకఁడు [12] మొదటి డిండిమభట్టు. మఱియొకఁడు శాలిమల్లుభట్టు లేక మల్లికార్జునభట్టు. అతఁడు రెండవ ప్రతాపరుద్రుని (1295–1313) యాస్థానకవిగా నుండి, కాకతీయ రాజ్యనాశనము కాగా, విజయనగరమునకు వచ్చి, కొలువులో చేరినాడు. వేదాంతదేశికుఁడు కుమారుఁ డైనవరదదేశికునితో, శిష్యులతో విజయనగరమును చేరి, యూరుకొనక మతప్రచారమునకు మొదలుపెట్టినాడు. [13]డిండిమభట్టారకునితో శాస్త్రవాదములు నెఱపి, వ్యర్థుఁడై నాడు. అంతటితో నూరుకొనక, నేలనువిడిచి సాముచేసినట్లు కవిత్వపుపోటీకి దిగినాడు. దేశికునిపుత్రుఁ డైనవరదదేశికుఁడు[14] శాలిమల్లుభట్టుతో శాస్త్రవాదనను బెట్టుకొన్నాడు. ఆవాదములు 1350 ప్రాంతములో జరిగినవి యనవచ్చును. ఉభయదేశికులవాదనలును

---

11. విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్ర, (కేశవయ్య అచ్యుతరాయ కృతము) రె. భా. 292.

12. మొదటి డిండిమ భట్టారకుని మూడవ కొడుకు రెండవడిండిమభట్టారకుఁడు అతఁడు దేవరాయలకాలములో (1404-2422) నుండి శ్రీనాథ మహాకవితో పండిత వాదము చేసి, డిండిమమును పగుల గొట్టించుకొన్నారు.

13. (1) శృంగార శ్రీనాథము (వేటూరి ప్రభాకరశాస్త్రి కృతము) 1923 పు 176, 180. (2) ఆంధ్రుల చరిత్రము (చి. వీ. కృతము) 1916 మూ. భా. పు 232 అధస్సూచిక.

14. (1) ఆంధ్రకవితరంగిణి (చా. శే.) నా. భా. పు. 165. (2) చాటు పద్యమణి మంజరి (వే. ప్ర. శా స్త్రి.) సం 2 భా 2 పు 94, 95.

విప్రప్రయోజనము లైనవి. ఇంక నక్కడ నుండుటకు వారికి మనస్కరింపలేదు. వేదాంతదేశికుఁడు వైరాగ్యపంచకమును వ్రాసినాఁడు. తండ్రికొడుకులు విజయనగరమును విడిచి కంచికి తిరుగుముఖముపట్టిరి. అయితే యెట్టివిత్తనమైన పెరుగుటకు ఏదియో యొకస్థలము దొరకును గదా!

విజయనగరరాజులకు ప్రత్యర్థులై రాచకొండరాజధానిగా పద్మనాయకులు పాలించుచున్నారు. వారు వీరశైవు లని చెప్పఁబడుచున్నారు. మతమునకును రాజకీయములకును భేదమెఱుఁగనిలేత వయస్సులో [15] అనపోతసింగభూపాలుఁడు (1345-1412) వేదాంతదేశకుని తనరాజ్యమునకు నాహ్వానించె ననవచ్చును. వేదాంతదేశికుఁడు లేఖలద్వారా సంప్రతింపులు జరిపినాడు. సింగభూపాలుని వైష్ణవప్రియత్వమును గమనించినాడు. అయితే దేశికుఁడు వృద్ధాప్యము కారణముగా రాచకొండకు పోలేకపోయినాడు. సంప్రతింపులమూలముగా సింగభూపాలునికి మతదీక్ష నొసగినాడు. ఆయువకుఁడు తాను [16] సర్వజ్ఞుఁడ ననుకొన్నాడు.

మధ్యవైష్ణవమును చెప్పుకొన్నమీఁదట నూతనమతనామ మొకటి పెట్టవలసియున్నది. సింగభూపాలునకు మాధవాత్మజుఁ డను క్రొత్త పేరు తగిలింపఁబడిన దని చెప్పవచ్చును. అది శివకుమారుఁ డను పేరువంటిది.

మాధవాత్మజుఁ డనగా మాధవునిపుత్రుఁ డనియర్థము కదా! సింగభూపాలునితండ్రిపేరు అనపోతనాయఁడు; పినతండ్రిపేరు మాదా (మాధవ) నాయుఁడు కాఁబట్టి యతఁడు మాధవాత్మజుఁడు కాఁడు;

---

15. (1) ఆంధ్రుల చరిత్రము (చి. వీ.) 1916 మూ. భా. పు 55, 80. (2) శృంగార శ్రీనాథము 1923, పు 178, 181.

16. శ్రీనాథుని పద్యములలోను, కొలచెలమల్లినాథుని రచనలలోను, వెలుగోటి వారి వంశచరిత్రలోను సింగభూపాలునికి సర్వజ్ఞ బిరుదు కానవచ్చుచున్నది.

కనుక [17] దేశికునిమతసిద్ధాంతమును సింగభూపాలుఁడు స్వీకరింపలే దని కొందఱు వాదించుచున్నారు. కాని అది సబబుగా లేదు. మాధవాత్మజుఁ డనునది పెట్టుపేరు కాని పుట్టుపేరు కాదు. అది మతదీక్షకు గుర్తుగాఁ బెట్టఁబడిన పేరుమాత్రమే. మాదా (మాధవ) నాయునితో సంబంధించిన పేరుమాత్రము కాదు. అట్లు దేశికుఁడు కొంతవిజయమును సాధించినాడు.

భట్ట పరాశరుఁడు క్రమముగా పండితుఁడు, వీర వైష్ణవుఁ డైనాడు. అతఁడు కోరుకొండరెడ్డిరాజులతో సంబంధమునుఁ బెట్టుకొన్నాడు. అతఁడు దీర్ఘకాలము జీవింపక వేదాంత దేశికునికంటెముందె వైకుంఠమునుఁ జేరుకొన్నాడు.అతనివిషయ మిటుపిమ్మటఁ జూచెదము.

శ్రీరంగవిగ్రహపునఃప్రతిష్ఠాపనలో నొకముఖ్యవ్యక్తి కూడ పాల్గొన్నాడు. అతఁడు సాళువవంశస్థుఁ డైనసాళ్వమంగు అనుమహాసైన్యాధిపతి. అతఁడు మధురసుల్తానుని జయించుటలోను, దక్షిణార్కాటుజిల్లాప్రాంతపువాఁ డైనసంపరాయఁ డనుప్రభువునకు తిరిగి రాజ్య మిప్పించుటలోను, స్థానభ్రష్ట మైనరంగనాథునివిగ్రహమును తిరిగి యుద్ధరించుటలోను ముఖ్యపాత్రను వహించినా డని పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు జైమినీభారతప్రబంధములోఁ దెలిపినాడు—

సీ. దురములో దక్షిణసుల్తాను నెదిరించి
కొనివచ్చి సంపరాయునికి నిచ్చి,
సామ్రాజ్యమునునిల్పి సంపరాయస్థాప
నాచార్యబిరుదు విఖ్యాతిఁగాంచె,
శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్వాదివేలు
మాడ లర్దేవునుమ్మడికి నొసగె

17. శృంగార శ్రీనాథము (వే. ప్ర. శాస్త్రి) పుట 181.

క. పరాయులు, సాళ్వమంగు, గోపన్నలు కలిసి పదిసంవత్సరములపా సైనను పోరు సలిపి దక్షిణభాగమును సుల్తానుబారినుండి విముక్తి చేసిరి. అట్లు శ్రీరంగము శత్రువుల చేతులనుండి బైటపడినది.

తిరుపతిలో శ్రీరంగవిగ్రహము సుమారుగా అరువదియేండ్లు రక్షింపఁబడినది. దానిని శ్రీరంగ దేవాలయములో పునఃప్రతిష్ఠాపనకు[18] గోపన్న పూనుకొన్నాడు. ఆఘనకార్యము 1371 లోఁగాని జరుగలేదు ఆకార్యములోఁ బాల్గొనుటచేత [19] సాళ్వమంగునకు శ్రీరంగస్థాపనాచార్య అనుబిరుదు లభించునట్లు సాళువాభ్యుదయ మనుసంస్కృత గ్రంథములోఁ జెప్పఁబడినది.

శ్రీరంగనాథవిగ్రహముయొక్క పునఃప్రతిష్ఠాపనను వేదాంత దేశికుఁడు చూచెనా? ఆప్రతిష్ఠాపనాసమయమున వేదాంత దేశికుఁడు, దానికి కారకుఁడైనగోపన్ననుగుఱించి రెండుశ్లోకములు రచించె నని[20] శ్రీరంగములోని కోయిలొలుగు అనుగ్రంథము పేర్కొనుచున్నది. కాని దానియందు నిజము లేదు. దేశికుఁడు 14-1-1369 నాడు మరణించినాడు. అట్టిగ్రంథములలో అభూతకల్పన లుండుటలో చిత్రము లేదు. ఆకాలమందు గంగాదేవి వ్రాసినమధురావిజయము(కంపరాయ చరిత్రము) లోఁ కంపరాయలు సాంపరాయలను చంపివేసె నని చెప్పఁబడినది. కాని అది వట్టియబద్ధ మని మిగతయాధారములనుండి తెలియుచున్నది. వేదాంతదేశికుఁడుగాని, పరాశరభట్టుడుగాని ఆవిగ్రహ పునఃప్రతిష్ఠాపనను జూచుటకు నోచుకొనరైరి.

శ్రీరంగవిగ్రహముయొక్క సాహసోపాఖ్యానము కొందఱు తెలుగుకవులను ఉత్తేజపఱచినది. శ్రీగిరి యనుకవి (నవనాథచరిత్ర మొదలైనది రచించినయతఁడు) క్రీ. శ. 1300 ప్రాంతపువాఁడు.

---

18. తిరుపతి దేవస్థానమువారి ఎపిగ్రాఫికల్ రిపోర్టు పు 131, 132.
19. ఆంధ్రుల చరిత్రము, (చి. వి.) మూ. భా. పు. 410.
20. డిటో డిటో పు 345

అతఁడు 1310 ప్రాంతములో శ్రీరంగ మాహాత్మ్య మను ప్రబంధమును సృష్టించెను. అయితే యీగ్రంథము నేఁడు లభించుటలేదు.[21] భైరవ కవి (1320–80) శ్రీరంగమహాత్మ్య మను తెలుగువాక్యమును 1370 ప్రాంతములో రచించి రాఘవామాత్యునకు నంకిత మిచ్చెను. ఇంక భట్టపరాశరుని, నృసింహకవినిగుఱించి చూచెదము,

తూర్పుగోదావరిజిల్లాలో గోదావరీనదియొక్క తూర్పుగట్టున, రాజమహేంద్రవరమునకు నుత్తరముగా పన్నెండుమైళ్ళదూరమున కోరుకొండ యనుగ్రామమును, కొండయుఁగూడ నున్నవి. రెడ్డిరాజులు కొందఱు కోరుకొండను ముఖ్యపట్టణముగాఁ జేసుకొనిపాలించుచుండిరి. వారికి కోరుకొండరెడ్లు లేక మంచికొండరెడ్లని పేరు. ఆనాటిరాజులం దఱిది శైవమత మని చెప్పవచ్చును. అట్టి మంచికొండరెడ్ల వంశ ములోను[22] కాని ఆవంశములోనివాఁడైన ముమ్మడీంద్రరెడ్డి (1340–1370 వైష్ణవము నభిమానించెను. సర్వజ్ఞసింగమనాయనిప్రాపకమును గోరి యట్లు చేసియుండును. వేదాంతదేశికునిశిష్యుఁడైన భట్టపరాశరుని తనరాజ్యమునకు నాహ్వానించెను. అగురువు కోరుకొండను చేరి కొంత కాల ముండెను. కాని యతఁడచ్చటనే విష్ణుపదమునకుఁ బోయెను. మరణించుటకుఁబూర్వము భట్టరు, తాను కోరుకొండమీఁదనె లక్ష్మీ నృసింహుఁడనై వెలసెద నని చెప్పెనట! అతనిమరణము క్రీ. శ. 1350 కావచ్చును. కోరుకొండమీఁది లక్ష్మీనృసింహదేవాలయము 1353 లో నెలకొల్పఁబడినది భట్టరు కొంతకాలము కోరుకొండలో నుండుటచేత, నతనిస్మారకముగా, అకొండకుపరాశరశైల మనియు, దేవునికి పరాశరనృసింహమూర్తి యనియు పేర్లు పెట్టఁబడెను.

21. భైరవకవి కాలనిర్ణయమును గుఱించి నేను వ్రాసిన వ్యాసము అముద్రితము.

22. ఆంధ్రుల చరిత్రము (చి. వీ.) మూ. భా. పు 121-127 (రెడ్డిసంచిక, ప్రాచీనాంధ్ర భూగోళములలో గూడ పై సమాచారము మరల వ్రాయఁబడినది)

భట్టపరాశరునకు, మరణమునకుఁ బూర్వమె, ముమ్మడీంద్రరెడ్డి కొంకగ్రామమును దానముచేసెను. భట్టరు మరణించినపిమ్మట నతని తల్లి దానిని శ్రీరంగనాథస్వామికి [23] శాసనముగా దానము చేసినది. దానిలోఁజెప్పబడిన రొకముఖ్యాంశ మేమనగా, భట్టపరాశరునకుఁ బూర్వమె యారుగురుపరాశరభట్టు లుండినారు. అతఁడు ఏడవవాఁడు.

సంకుసాలనృసింహకవి రొకేమాటలో పేర్కొన్నభట్టపరాశరుఁ డతఁడె కాని యన్యుఁడు కాడు. అతఁ డెంతో ప్రసిద్ధికెక్కినవాఁడు; కాబట్టియే నృసింహకవి యతనివిషయము నొకేమాటలో తేల్చివేసినాడు. ఆవైష్ణవగురువువ్యక్త్యైకీకరణమునకు మఱియొకపదమునకుగూడ నోచుకొనలేదు.

నృసింహకవి, భట్టపరాశరునినుండి గురూపదేశమును 1350లో పొందియుండును. అతఁడు వీరవైష్ణవసిద్ధాంతమును మెచ్చుకొన్నారు. అతనివయస్సు ఇరువదికంటె నధికముగా నుండకపోవచ్చును.

నృసింహకవియొక్కగురువు ఆభట్టపరాశరుఁడె కాని మఱియొకఁడు కాఁ డనుటకు మఱియొకచిన్నయాధారముగూడ నున్నది. వేదాంతదేశికుని దైన "క్షోణీకోణ" యనుశ్లోక మిట్లు తెనుగుఁజేయబడినది—

శా. జ్ఞానప్రౌఢమహాకవీశ్వరవచస్సంస్తూయమానుండు ల
క్ష్మీనాథుండు,మదల్పవాక్యరచనాస్వీకర్త గాకుండునే ?
నానాభూపతులెల్లఁ గానుకలు రత్నశ్రేణు లర్పింపఁగా
ధానాముష్టి ముచుంగుచేలుఁ గరుణన్ ధన్యాత్ముఁగా జూడఁడే
(కవికర్ణ-పీఠిక 28)

భట్టపరాశరుని నోటినుండి విన్నశ్లోకమునే నృసింహకవి యట్లనువదించియుండున ని [24] రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు చెప్పిన మాటలు సబబుగా నున్నవి.

23 ఆంధ్రకవి తరంగిణి చా. శే. ) సం 8-18.
24. ఆ. సా. ప. ప. సం 6-273.

పరాశరభట్టు అను పేరుగల గురువులలో రెండురకముల వారున్నా రనవచ్చును, శ్రీరంగదేవునిభక్తులు కొందఱు, తిరుపతి వేంకటేశ్వరునిభక్తులు మఱికొందఱు పదునారవశతాబ్దమునుండియే తిరుపతికి ప్రసిద్ధివచ్చినది. కాఁబట్టి వారు పేర్కొనుదేవునిబట్టి వారికాలమునుగూడ స్థూలముగా నిర్ణయింపవచ్చును. దానికి ఇతరఆధారములుగూడ కలిసిరావలెను.

## 5. కావ్యము

పదునాఱవశతాబ్దిలో ప్రబంధ మనుపదము పరిపాటియైనది. విలాసకావ్యములనే కాక భాషాకావ్యములను, శాస్త్రకావ్యములనుగూడ ప్రబంధము లనిరి. భట్టుమూర్తి తనహరిశ్చంద్రనలోపాఖ్యానమును మహాప్రబంధమన్నాడు. మూర్తికవి తన నరసభూపాలీయమను శాస్త్రకావ్యమును ప్రబంధమన్నాడు. అట్టిసందర్భములో మాంధాతృచరిత్రను కావ్య మని పేర్కొనుటను జూడగా, నాగ్రంథము విలాసప్రబంధోద్యమునకు ముందే పుట్టిన దని తోఁచకమానదు. అయితే మఱియొకసందేహము కలుగవచ్చును. పదునైదవశతాబ్దము వఱకును ముఖ్యముగా అనువాదకావ్యములే కనఁబడుచున్నవి కదా; కవికర్ణరసాయనము అనువాదముగాక స్వతంత్రరచన; కాఁబట్టి అది పదునైదవశతాబ్దమునకుఁ బిమ్మట పుట్టినదియని యెవ్వరైన వాదనకుఁ బూనుకొనవచ్చును. దానికి సమాధానము చెప్పవలసియున్నది. పదునైదవశతాబ్దాంతమువఱకును మనకుదొరికినకావ్యములను గమనించగా, వానిలోనూటికి తొంబదిపాళ్ళు సంస్కృతమునుండి తెలుగునకు దింపినరచనలే! అంతమాత్రముచేత స్వతంత్రరచనలు లేకపోయినవని తలచుట పట్టిపొరపాటు. వాటిసంఖ్య తక్కువ యని తలపోయరాదు. నన్నయభట్టు చేసినమిగతరచనలు గనఁబడుటలేదు. భీమకవి రచనలు దొరకుట లేదు. తిక్కనవిజయసేనము;[25] చక్రపాణిరంగనా

25. చాటు పద్య మణిమంజరి (వే. ప్ర) 1952 ద్వి. భా (1) పు 80-84

ధుని వీరభద్రవిజయము, శరభచరిత్రము, శ్రీగిరినాథవిక్రమము, మిత్రవిందాపరిణయము; నాచనసోమనాథుని వసంతవిలాసము; రావిపాటితిప్పన్న మదనవిజయము; చిమ్మపూడియమరేశ్వరుని విక్రమసేనము; దోనయమాత్యుని సర్వలోకాశ్రయము; శ్రీగిరి కవియొక్క నవనాథచరిత్ర; పశుపతినాగనాథుని రచనలు; శ్రీనాథమహాకవి యితరరచనలు మొదలైన వెన్నియో కనఁబడుట లేదు. సకలనీతిసమ్మతములోఁ జెప్పఁబడిన కొన్ని గ్రంథములు బైటపడుట లేదు. పెదపాటి జగ్గనకవియొక్క సంకలితగ్రంథములో నీయబడిన ప్రబంధములలో నెన్ని ప్రాచీనరచనలో చెప్పలేము. ఇంకను కవిరాక్షసుఁడు, క్షేమేంద్రుఁడు, అమృతనాథుఁడు మొదలగు పేర్లెన్నియో తెలియుచున్నవి. రచనలు బైటికి రాలేదు. ప్రజలు, సామాన్యపండితులు రానురాను మాలికరచనలయొక్క సొగసు నెఱుఁగకయు, మతసంబంధరచనల నాదరించియు, భాషలో మొగ్గలువేయు తక్కువరకపు రచనలను మెచ్చుకొనియు, పూర్వపు ఉత్తమసాహిత్యమును నిరాదరించిరి. ఇప్పుడు మిగిలినవాటినిబట్టి అనువాదయుగ మని వెనుకటియుగమునకు పేరు పెట్టుట ప్రమాదము మాత్రమె. తొలియుగములో నిరచన మైన మాంధాతృచరిత్ర యాదృచ్ఛికముగా మిగిలినదని చెప్పినను చెప్పవచ్చును. అది ప్రాచీనస్వతంత్రరచనలలో నొకటి.

నృసింహకవియు, మడికిసింగనయు (1340–1400) సమకాలికులు. కవికర్ణరసాయనములోఁ జెప్పఁబడిన రాజనీతులలో (ద్వి. ఆ. 4–53) నొకపద్యమైనను మడికిసింగన్నయొక్క సకలనీతిసమ్మతములోని కెక్కకపోవుటకు సమకాలతయే కారణమైయుండును.

నరసింహకవి గురూపదేశమును పొందునాటికి (1350) యిరువది యేండ్లవాఁడై యుండునని కొంటిమి. అతఁడు కవికర్ణరసాయనమును నలుబదియవయేట (1370) సంతరించియుండును.[26] పన్నిద్దరాళ్వారు

26. ప్రబంధమణి భూషణము (మా. రా. కవి) పీఠిక 5

లను మఱియొకగ్రంథమును గూడ రచించినాడట. మొత్తముమీద నతఁడు డెబ్బదియేండ్లు బ్రతికి 1400 లో వైకుంఠమును నలంకరించి యుండును.

### 6. ఐ తి హ్య ము

కృష్ణదేవరాయలకాలములో సంబంధించిన నైతిహ్యము నిచ్చటఁ జూచెదము. కృష్ణదేవరాయలకు[26] మోహనాంగి యనుకుమార్తె యున్నదట! ఆమె తండ్రితో చదరంగ మాడుచు, తనపావు నొకదానిని నప్పుటకు సాధ్యము గాకపోగా ఉద్ధతులమధ్య పేదకు నుండదరమె' యని వాకొన్నది. ఎంతో చక్కగాకుదిరిన యా యుట్టంకింపునకు కృష్ణరాయ లానందించి, కుమార్తెను పద్యమును పూర్తిగా చదువు మనగా నామె—

గీ. ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిఁ జూచి
తరుణితనుమధ్య మెచటికో తలఁగిపోమె
నుండెనేనియుఁ గనఁబడకున్నె! యహహా!
యుద్ధతులమధ్యమునఁ బేద కుండదరమె (ఆ 3-26)

యని చదివి, ఆపద్యమును కవి యమ్ముచుండగా కొంటి నని చెప్పెను. రాయలు ఆశ్చర్యముతో యాపద్విషయమును బరిశోధింప దలచినాడు. నృసింహకవి విజయనగరమునకు వచ్చినట్టును పెద్దన యడ్డుపడి రాజదర్శనము గానీయనట్టును, కవి శ్రీరంగమునకు బోయి యా దేవునికి తనకావ్యమును సమర్పించునట్టును విని విచారించినారు. నృసింహకవి పదునాల్గవశతాబ్దివాఁడు, రాయలు పదునాఱవశతాబ్ది వాడు. కాఁబట్టి యాకథ శుద్ధకల్పితము. అయితే నరసింహకవికాలమున నొకపెద్దనకవి లేకపోలేదు. వానినిగుఱించి చూచెదము.

విశాఖజిల్లాలోని యెలమంచిలి రాజధానిగా చాళుక్యవంశము

---

26 మోహనాంగి చదువుకొన్నదియే కాక మరీచీపరిణయమను తెలుగు ప్రబంధమును వ్రాసెనట! కాని యా పుస్తకమెచ్చటను లేదు.

లోని యొకశాఖవారు క్రీ.శ. 1200 నుండియును బరిపాలించుచుండిరి. వారు కవిపోషకులుగా గూడనుండిరి, దోనయకవి 1358 లో ఉపేంద్ర రాజునకు సస్యానంద మను శాస్త్రకావ్యము సంకిత మిచ్చెను. ఆరాజ వంశములో మనుమోపేంద్రు డనురాజు 1380 ప్రాంతమున బాలించి నాడు. అతనికుమారుఁడు విశ్వేశ్వరప్రభువు, కుమార్తె అంబిక. విశ్వేశ్వరరాజు 1400 ప్రాంతమున నుండినాడు. అతనికి చిన్నకోటపెద్దనకవి 1405 లో కావ్యాలంకారచూడామణి సంకితమిచ్చినాడు. నృసింహకవి యొక్క కడపటివయస్సులో విశ్వేశ్వరరాజు, పెద్దనయు వడుచువారై యుండురు. పైనఁజెప్పిన యైతిహ్యము మనుమోపేంద్రుడు పెద్దన, అంబికల నాటిది కావచ్చును. కాబట్టి యది కేవలము కల్పితము కాకపోవచ్చును.

## 7. స్వస్థలము

నరసింహకవి తెలుగుదేశములో ఫలానాప్రాంతపువాఁ డను ప్రతీతి కనఁబడదు. అతఁడు కడపజిల్లావాఁ డనుజనశ్రుతి లేదు. కడప జిల్లావా డని- [27] బమ్మెరపోతన, అయ్యలరాజు రామభద్రకవి, అల్లసాని పెద్దన, రామరాజభూషణుఁడు, తరిగొండ వెంకమ్మ, వేమన, కవి చౌడప్ప, పండితరాట్ జగన్నాథకవి, కోలాచలమల్లినాథసూరి-చెప్పఁ బడుచున్నారు. అట్టిజనశ్రుతిలోఁ గొన్నినిజముగా నుండుటయు గల దని మన మెఱుఁగుదుము.

కడపజిల్లాలో సుంకేసుల అనుగ్రామ మున్నది. ఆ గ్రామము నుండియే నృసింహకవియొక్క యింటిపేరైనసంకుసాల వచ్చిన దని కొందఱినమ్మకము. దానిలో నిజ మెంతయున్నదో చూచెదము.

బ్రాహ్మణ్యనిఘంటువులో సుంకేసలము లేక సులకాసరి యనగా తెల్లనిపువ్వులు గల యొకపెద్దచెట్టనియున్నది. అట్టిచెట్లు ఆగ్రామ

27. కరపలో జరిగిన పరిషత్సభలో జనమంచి శేషాద్రిశర్మ గారిచ్చిన యుపన్యాసము. ఆ. సా. ప. ప. సం 6-సం 5 పు 212

ములో నుండుటచేత దానికి నా పేరు వచ్చియుండు నని స్థూలదృష్టికి గోచరింపవచ్చును. అది య ట్లుండనిండు.

ఇప్పుడు సంకేసల యనిచెప్పఁబడెడిగ్రామమునకుఁ బూర్వపు పేరు వేఱుగా నున్నది. [28] క్రీ.శ. 1600 ప్రాంతములో దామెర వెంకటప్పభూపాలుఁడు రాజ్యమును చేయుచుండగా, సంకేశలరాజ్యమును మురాత్ ఖానుఁడు పరిపాలించుచుండెను. దానిముఖ్యపట్టణము సంకేశల. అప్పటిలో దామెరవారికిని, ఖాన్ నకును జగడము జరిగినది. ఆనాటి యొకకవి—

సీ. సంకేశపురిలోన శూరుఁడై మ్లేచ్ఛుండు
కలుషుఁ డెంతయు మురాత్ఖానుఁ డనగ,
బలియుఁడై యెదిరింప బవరములో, వాని
శిరము వ్రయ్యలుచేసి శీఘ్రమునను

అని వర్ణించియున్నాడు. ఆయూరి పేరు సంకేశయె యుండగా తురకలపరిపాలనలో దానియుచ్చారణ సంకేసల మైనది. విశాఖజిల్లాలోని మెలమంచి యనుగ్రామనామము యెలమంచిలి యైనట్లుగా నది కూడ నున్నది. పై గ్రామముయొక్క తొలిపేరు సంకేశ యని తెలుసుకొంటిమిగదా! సంకేశ యనునామముసంకుసాల యనిగాని లేక సుంకుసాలయనిగాని మారినదనుట సబబుగాదు. కాఁబట్టి కవియొక్కస్థలమని చెప్పఁబడెడి సంకుసాల కడపజిల్లాలోనిది గాక మఱియొకచోటిది యగు నని గ్రహింపవచ్చును. అది యేదో తెలుసుకొనెదము.

తూర్పుగోదావరిజిల్లాలోని కోరుకొండకు భట్టపరాశరుఁడు విచ్చేసినప్పుడు, నరసింహకవి యుపదేశమును బొందె నని చెప్పియుంటిమి కదా! అతఁడు తూర్పుగోదావరిజిల్లానివాసి యైయుండినప్పుడే యట్టిదిసహజమగును. కాఁబట్టి కవియొక్కస్థల మనిచెప్పఁబడెడి సంకు

28. చాటుపద్యమణిమంజరి (వే. ప్ర) ద్వి. భా. (1) పు 324.

సాల తూర్పుగోదావరిజిల్లాలోనిదె కావలెను. కాని యట్టిపేరు గల గ్రామమేదియు నక్కడ లేదు. కవియింటిపేరు సంకుసాల యనియే కాక సుంకసాల యనిగూడ చెప్పఁబడుచుండిన దని మనము ఆదిలోనె చూచితిమి. సుంకసాలయనగా నేమో తెలుసుకొనెదము.

గోదావరినదీప్రాంతమున చిన్నస్వతంత్రరాజ్యములు బలిసినవి. ఏటిమీద సరుకులు రవానాచేయునప్పుడు సుంకములను వ్యాపారస్థుల వద్దనుండివసూలు చేయుచుందురు. ఈనాటి చౌకీపోస్టులవంటివి ఆనాటి సుంకసాలలు అవి రేవులవద్ద నుండును. వాటియందు సుంకములు వసూలుచేయుసిబ్బంది యుండును. వారివృత్తి సుంకములు వసూలు చేయుటయే. నరసింహకవి యేదో యొకసుంకసాలలో తల నమ్ముకొని యుండగా, అతనికి సుంకసాల యనుయింటిపేరు యేర్పడినది. దాని యూభాసరూపమె సంకుసాలకాఁబట్టి నరసింహకవి గోదావరీతీరవాసి. అంతేకాక యతఁడు రాజమహేంద్రవరకాపురస్థుఁ డనికూడ తేల్చి వేయవచ్చును.

నృసింహకవి మాంధాతచరిత్రమును రచించినాడు కదా [29] అతని వంశమువారికి మాంధాతచరిత్రకవివా రని పేరువచ్చుటలో వింత లేదు. అది క్రమముగా మాంధాతవా రగును. నేడు రాజమహేంద్రవరములో పోతగట్టువద్ద మాంధాతవారివీధి యున్నది. అందులో మాంధాతవా రున్నారు. అది నృసింహకవి యుండినస్థలమనియు, అతని వంశమువారు వారె యనియు చెప్పవచ్చును. వారు వెలనాటివైదికులు. అయితే నృసింహకవికాలమున కింకను యింటిపేర్లు పరిపాటి కానట్లై, శాఖాభేదములుగూడ పుట్టలే దని యెఱుఁగవచ్చును.

ఏ కవియొక్కస్వస్థాన మైనను. అతఁడు తనకావ్యములో వాడినమాండలికపదములనుండి స్థూలముగా గ్రహింపవచ్చును, ఇప్పు

29. కవుల యింటిపేర్లు అనేకవిధములుగా నేర్పడును. శ్రీనాథ మహాకవి యొక్క దౌహిత్రులు శ్రీనాథుని వారను ఇంటిపేరును పెట్టుకొన్నారు. అది యొక గుర్తుమాత్రమె.

డావిషయమును జూచెదము. నరసింహాకవి యుపయోగించిన ఈక్రింది పదములనుబట్టి, ఈతఁడు తూర్పుగోదావరిజిల్లానివాసి యని చెప్పవచ్చును. ఎలుఁగురాయుట (2-75) కంఠధ్వని తగ్గుట; ఆవిశ (?-158); శివము లెత్తుట (2-169); నెత్తురుమడువులు (2-175) నుయ్యి (3-38) బావి; ఏటి కెదురేగుట (3-58, 20) కుడిచినిల్లు (3-117) తిన్నయిల్లు; పెండ్లికిఎదుర్కోని (3-150)ఎదుర్కోలు అనివాడుకలోనున్నది; నభము అల్లోనేరేడువలె నున్నది (4-123) అల్లోనేరేడుపండ్లు అచ్చటసామాన్యముగాలభించును. వెక్కసము (5-9) అధికము; వనధి పర్యంకమం బయ్యు రేవులన కానిచోరనిరీతి (5-78); వడపిందె (6-42); ఉప్పున ఊడుట (6-144) తమ్మలకునోరొగ్గకున్న (6-151) తమ్మయునగ నమిలిన తాంబూలము.

## 8. టూకీ రాజకీయ చరిత్ర

క్రీ. శ. 1323 లో కాకతీయసామ్రాజ్యము చితికిపోగా, చిన్న చిన్నరాజ్యము లెన్నియో పుట్టి, ఒకదానితో నొకటి యుద్ధము చేసికొనుచుండినవి. పడమటిభాగమున విజయనగరరాజ్యము 1336 లో స్థాపింపఁబడినది. పశ్చిమోత్తరముల బహమనీరాజ్యము 1347 లో పుట్టినది. కాపయనాయకుఁడు ఓరుగంటిలో పరిపాలించి 1369 కి తుదముట్టినాఁడు. రాచకొండ రాజధానిగా పద్మనాయకులు పాలించుచుండిరి. నెల్లూరు, గుంటూరుజిల్లాలలో కొండవీటిరెడ్లు విజృంభించిరి. పడమటి గోదావరిజిల్లాలో ఉండిరాజు లుండిరి. మన్నెపుప్రాంతమును సూరవరము, కామవరపుకోట రాజధానులుగా ఏఱువరాజవంశ మేలుచుండెను. తూర్పుగోదావరిజిల్లా మన్నెపుప్రాంతమును, కోరుకొండ రాజధానిగా కోరుకొండరెడ్లును; పిఠాపురమునుండి కొప్పులరెడ్లును; విశాఖజిల్లాలోని యెలమంచిలినుండి చాళుక్యశాఖవారును; మఱికొందఱును పాలించుచుండిరి. వారికి ఉత్తరమున కళింగరాజ్యమున్నది.

ఈ రాజులు ఎవరికివారే ఏకచ్ఛత్రాధిపతులై, దొమ్ములాడుకొనుచుండిరి. కాఁబట్టి రాజకీయశాంతి మృగ్యముగా నుండినది. అయితే రాజులు తమశక్తి కొలఁదియు కవుల నభిమానించి, పోషించిరి. కాఁబట్టి కవులు చాలమందియే యుండి రనవచ్చును. నరసింహకవిజీవిత మంతయు నట్టిరాజకీయపరిస్థితులలోఁ గడచిన దని చెప్పవచ్చును. అతనికి సమకాలికులు భైరవకవి, [30] మనుమంచిభట్టు, శ్రీనాథుఁడు దోనయ, విన్నకోట పెద్దన, జక్కయ్య, కొఱవిగోపరాజు మడికిసింగన, అనంతామాత్యుఁడు మొదలగువారు. అయితే కవులు సాధారణముగా రాజాస్థానములలో కుదురుకొనుచుండిరి. నరసింహకవితీరు వేఱుగా నున్నది.

## 9. బహుస్వేచ్ఛాస్వభావము

నృసింహకవి మొదటిలో కొన్నియాస్థానముల వెంటఁ దిరిగియుండును. అయితే అతనిది బహుస్వేచ్ఛాప్రకృతి. కాఁబట్టి యెక్కడను ఇముడలేరు. అతఁడు తోడికవులతో నెట్లుండెనో తెలియదు. అతఁడు తనయొక్క విలువను పూర్తిగా నెఱిఁగియున్నవాఁడు తనకు ముందున్న గొప్పసంస్కృత, తెలుగుకవుల పేర్లనెత్తక, ఒక్క నమస్కారబాణమును విడిచి యూరకొన్నాడు.

కవులు తమ్ము పోషించు రాజుల యభిప్రాయములకు లొంగియుండవలెను. వారిలో నెరసులను జూపరాదు. రాజులు నిరంకుశులు. అట్టి రాజులకును, స్వైరుఁడైన నృసింహకవికిని నైక్యతఁ ఘటిల్లదు. అతనివలె రాజులను జీవచ్ఛవములు, పిశాచములు, దురాత్ములు అని నిందించినకవిచంద్రుఁడు మఱియొకఁడు లేడు. వారికి నంకిత మిచ్చినపుస్తకము కుక్కముట్టుకున్న పాలవంటి దట! (పీఠిక 25) కాఁబట్టి రాజపోషణ సున్న. ఆమహాకవి తనపాట్లను తాను పడినాడు. తన కావ్యగౌరవమును గాని, ఆత్మగౌరవమునుగాని పోగొట్టుకొననిధీరుఁడు.

---

30. మనుమంచిభట్టునుగుఱించి నేను వ్రాసిన వ్యాసమింకను ముద్రింపఁబడలేదు.

మతములో నైక్యత ప్రధానము. వెఱ్ఱిమొఱ్ఱిసిద్ధాంతములు ప్రచారము లైనకొద్దియు ప్రజలలో నేకీభావము సన్నగిల్లును. అట్టి యెడ మనదేశమునకు పదునొకండవశతాబ్దినుండియు క్రొత్తమత సిద్ధాంతములపీడ పట్టినది. దానికి తోడు మతీయొకదుర్గుణము పుట్టినది. అది గజనీమహమ్మదును జూచి నేర్చుకొన్న తెలివి! కొందఱు మతో ద్ధారకమ్మన్యులు కుతంత్రములు పన్ని కొన్నిశైవదేవాలయములను వైష్ణవదేవాలయములుగా మార్చుచుండిరి. అజ్ఞాను లైనరాజులు కొందరుతటస్థులుగా నుండిరి. అట్టివారివల్ల దేశములో ననైక్యతా విషవాయువు ప్రసరించినది. ఈ దుస్థితి విజయనగరసామ్రాజ్యము యొక్క కడపటిదశలో ప్రబలినది. మహమ్మదీయవిజయములకు దోహద మిచ్చినది. వారు దేవాలయములను చిదుకగొట్టి, మసీదులను లేపిరి. మతములోని యైక్యతను గ్రహింపకపోవుట నృసింహకవిలోని యొకపెద్దలోపము.

నరసింహకవియొక్క స్వేచ్ఛాప్రకృతి, మతసిద్ధాంతముగూడ రాజాశ్రయమునకు నడ్డువచ్చినవి. దిక్కు లేనివానికి దేవుఁడె దిక్కు! అతఁడు తనకావ్యమును కావేటిమధ్య నున్నరంగనాథుని కిచ్చి తృప్తి పడినాడు. తనపాలఁబడిన మాంధాతమహారాజునుదుట విష్ణుపాదము లను పెట్టించినాడు.

## 10. ఇతివృత్తము; రసము

గరుడపురాణము, బ్రహ్మాండపురాణము అను రెండుపురాణము లలో శ్రీరంగమహాత్మ్యకథయున్నది. దానినె గ్రంథాదిని నృసింహ కవిపీఠికగా టూకీగావ్రాసినాడు. దానినివిడిచిపెట్టి శ్రీరంగనిపునరుద్ధా రణచరిత్రను వ్రాసియుండినయెడల యథార్థాంశములతో విరాజిల్లు చుండెడిది.

శ్రీరంగమాహాత్మ్యములోని ముఖ్యాంశ మేమనగా-రావణుని తమ్ముఁడైనవిభీషణుఁడు అయోధ్యనుండి రంగనాథస్వామివిగ్రహ

మును విమానముమీద నాకాశమునకెత్తినాడట! పిమ్మటనావిమాన మును కావేరీనదిమధ్యను లంకలో దింపినాడట! మఱియెగురవేయుటకు సాధ్యముగాక తనదారిని తానుపోయినాడట! ఇట్టికల్పనాకథయే నల్లగొండజిల్లాలోనున్న కొలనిపాకలోని మాణిక్యదేవుని గుఱించి కూడ నున్నది.

నరసింహకవిరొక్కప్రతిజ్ఞ యిట్లున్నది- తనశృంగారవర్ణనను విన్నయతివిటుఁడును, వైరాగ్యవర్ణనను విన్నవిటుఁడు యతియు నౌదురు (పీఠిక 22) అట్టివర్ణన కనుకూలముగానొక కథను కనుఁగొన వలెను. షోడశమహారాజులలో నొకఁడును, సూర్యవంశీకుఁడునైన మాంధాతరాజు ప్రసిద్ధించినాడు. అతఁడు విభీషణునికాలమువాఁడని కవినిర్ణయించుటచేత, రావణునితో నొకయుద్ధమును కుదుర్చుటకు వీలైనది.

కవితనకావ్యమును ఆరు ఆశ్వాసములుగా వ్రాయుచు, మూడు భాగములుగా జేసినాడు. మొదటి రెండాశ్వాసములలో మాంధాతరాజు పుట్టుక, సింహాసనమెక్కుట, దిగ్విజయములువర్ణింపఁబడినవి. అట్లు వీరరసము ముగిసినది. తర్వాతి రెండాశ్వాసములలో రాజుగారి ప్రేమ, పెళ్ళి, శృంగారక్రీడలునున్నవి. అట్లు శృంగారరసము తుదముట్టినది. కడపటిరెండాశ్వాసములలోను మతము, భక్తి, వేదాంతము, వైరాగ్యము వివరింపఁబడినవి. అట్లు శాంతరసము పూర్తియైనది కాఁబట్టి ఈ గ్రంథములో ఏ యొక్కరసముది పైచేయికాలేదు. వీర, శృంగార, శాంతి లేకజ్ఞానరసములు సమముగా వర్ణింపఁబడినవి. శాంతరసములో విశిష్టాద్వైతము మిళితము చేయఁబడినది. అది ప్రచారలక్షణము కాఁబట్టి మాంధాతృచరిత్రమును కేవలము విలాసరచనగా నెత్తుకొనక, మత దృష్టిని జొప్పించినాడు. నిజముగా మాంధాతకథ మొదటి నాలుగాశ్వాసములతో పూర్తియైనది. కాని మతప్రచారదృష్టితో మాంధాత

పూర్వజన్మవృత్తాంతము, తపస్సు అనునంశముల నెత్తుకొని, మరి రెండాశ్వాసములుగా పెంచి భక్తిప్రచారము చేసి తృప్తి పడినాడు. కథలోమట్టుకు జీవితచరిత్రకు కావలసినవైక్యత యున్నది-పుట్టుక, పెరుగుదల తురీయదశ అయితే దీనిలోని తపస్సు కడపటియంశమై, తురీయదశలోనిభాగ మైనది.

కవులు సమకాలపుఘటనలను పుస్తకములలోఁ గనఁబఱచెదరు, కాని ఆకావ్యములో నట్టివి స్పష్టముగా లేవు. కవి నాలుగువర్ణజాతి వారిని వర్ణించుసందర్భములో, వాల్లవజాతివారిని కృషీవలులుగాఁ గాక యుద్ధభటులుగా వర్ణించినాడు. ఇది సమకాలికాంశ మనవచ్చును. ఆ నాడు క్షత్రియులే కాక రెడ్లు మొదలైనవారుగూడ దేశభాగము లను బాలించుచుండిరి. మంచికొండరెడ్లు కోరుకొండను బాలించుచు, తాము బ్రహ్మక్షత్రియవైశ్యులకంటె పరిశుద్ధుల మని [31] శాసనము లలో వ్రాసుకొన్నారు. మాంధాతచరిత్రలో వేశ్యలవర్ణనలు మితి మీరి యున్నవి. అది కవిచేసినప్రతిజ్ఞాఫలితమై యున్నది. దాని యశ్లీ లతను కవి గుర్తించలే దనిచెప్పవలసియున్నది.

## 11. సందేశము

నృసింహకవి రాజ్యపాలకులను పిశాచములు ఇత్యాదులుగా వర్ణించి యూరుకొనలేదు. రా జెట్టివానిగా నుండవలెనో వారికి బోధింపదలచినాడు. ఒక ఆదర్శరాజు యొక్క జీవితమును వివరింపఁ బూనుకొన్నాడు. అవనికి మాంధాతరాజును తీసుకొని, ఆదర్శరాజు యొక్క జీవితమును చిత్రించినాడు. దానిలోనె వారికి మతాదర్శమును గూడ దెలిపినాడు. అట్లు ఆతఁడు పరిపాలకుల నొకసందేశము నిచ్చి నాడు. మతప్రచారము బట్టబయలుగా నున్నది.

31. ఆంధ్రుల చరిత్రము (చి.వీ) మూ. భా. పు 129.

## 12. కవిత్వము

నృసింహకవికి మహాకవులు ఒరవడి పురాతనకవీశ్వరు లేగనివీథి లేదు (పీఠిక 18) అనితొలుతనే చెప్పినాడు. అయితే కోకిలకు పాడుట సహజము (పీఠిక 18), కాఁబట్టి తాను పాడుచున్నా నని సంజాయిషీ చక్కఁగా నిచ్చినాడు.

ఆకవి వర్ణనలలో సిద్ధహస్తుఁడు నాలుగవయాశ్వాసములో వర్ణనలుతప్ప కథ లేదు. శృంగారవైరాగ్యవర్ణనలలో ప్రత్యేకశ్రద్ధను జూపినాడు. మాంధాతరాజుయొక్కయుద్ధవర్ణన సహజముగాను, ఆవేశకరముగా నున్నది. ఆరాజునకు రాజనీతులను బోధించినాడు. భావములు లోతైనవి. ఆకవికిసహజవర్ణనలే కాని, అతిశయోక్తు లంతగా నసిపడవు. అది యాతని లోకజ్ఞతను, వివేకమును వెల్లడించుచున్నవి. అట్లతఁడు అతిశయోక్తులలో తలదాచుకొనుకవులకంటె మిన్న. అతనిత్రోవ యతనిదె. మతగ్రంథమును గాక రెండింటిని చేర్చిన వింతకావ్యమును పుట్టించినాడు. కొత్తమతసిద్ధాంతపుసుడిలోఁ జిక్కుకొన్నాడు. రాజులలో కొందఱుపండితు లున్నారు. వారు మెచ్చుకొనునది పండితకవిత్వము. కాఁబట్టి కవులకు శైలినిర్ణయములో పూర్తిగా స్వాతంత్ర్యము లేదు. తమ్ముపోషించెడివారి నొకవైపున తృప్తిపఱుపవలసియున్నది. అట్టిదుస్థితి ప్రధానముగా మధ్యయుగమువారికిఁ బట్టినది. పూర్వకవిత్వము తేటశైలిలో రసభావములతో చిప్పిలుచుండును పదునారవశతాబ్దికిపిమ్మటఁ బుట్టినకవిత్వములో భాష జటిలముగాను భావము నీరసముగా నుండుట యొకసామాన్యలక్షణము. ఇతివృత్తము నామమాత్రముగా నైనను పూర్వవృత్తముగా నుండ వలెనని భట్టుమూర్తి తీర్మానము. ఆకొంచెమునుగూడ వదలెడి సాహసము అతనికిఁ బుట్టలేదు కదా!

నృసింహకవి పూర్వయుగము యొక్క మూఁడవ పాదములో నున్నాడు. ఏరాజాస్థానములోను కుదురుకొన్నవాఁడు కాడు. కాఁబట్టి యొకరిని తృప్తిపఱచుటకు గంటమును చేతబట్టవసరము లేదు. అతని స్వభావ మెట్టిదో, కవిత్వముగూడ నట్టిదియె. గోదావరి గంగ వెల్లువ వలె నుండును. పండితశైలి యాతని పరమార్థముకాదు. తేటతెనుగు లోగూడ రచన యున్నది. రసమున కవసరమనితోఁచినచోట్ల సంస్కృతమును గుప్పింపక మానలేదు. భావమునకు, రసమునకు తగినశైలిని వాడుటయే యతని యాశయము. మృదుమధుర భాషకోసము తన్నుకు లాడక, తిక్కన మహాకవివలె సహజశైలిని వరించినాడు. అయినను పండితశైలికి బహుదూరముగా లేడు. అయితే అతని కవిత్వములో కోమలశబ్ద విన్యాసము నూతనపదబంధములు గనఁబడవు.

మహాకవికి నవసర మైనపాండిత్యము, సర్వజ్ఞత యతనిలో నున్నవి. తన శక్తిసామర్థ్యములను పూర్తిగా నెఱిఁగినవాఁడు. కవులనే యాశ్చర్యపడఁజేయు కావ్యమును సృష్టింపగల ననుఅహంభావము నిండుగా నున్నది, కాఁబట్టి తనకావ్యమునకు కవికర్ణరసాయన మను గీర్వాణపు పేరును బెట్టినాడు. కవులు నవ్వుకొందురు గాక! అతఁడు సమర్థతతోనె నిర్వహించినాడు. ఆకావ్యమును కృష్ణదేవరాయఁ డనుకరించి యాముక్తమాల్యదను రచించినా డన్న వింతలేదు.

నృసింహకవి మహాకవియే గాని సామాన్యుఁడు గాడు. అతని కవిత్వమును గుఱించి మానవల్లివారు[32] కవికర్ణరసాయనము మను చరిత్రతో నీడురాదని యనేక విద్వత్కవుల యభిప్రాయము. అట్టివారితో నే నేకీభవింపకుండుట నా యభాగ్య మని తలచెదను. నూతనకల్పనలు, రసస్ఫూర్తియు, హృద్యాలంకారములును, అశిథిల బంధమును గల యీకావ్యముతోఁ గేవలము దృఢశైలియు, బరా కాష్ఠయు గల మనుచరిత్ర యెట్లు తులతూగును?" అని ప్రశ్నించు

32. ప్రబంధ మణిభూషణము (మా. రా) 1911

చున్నారు.[33] గురుజాడ శ్రీరామమూర్తిగారు "ఇతనితో సమానుఁడగు ప్రబంధకవి ఆంధ్రములో నున్నట్లుగా నే కానుపించఁడు" అన్నారు.

నృసింహకవి రాజమహేంద్రవరవాసి క్రీ. శ. 1330 లో జన్మించినాడు. బహుస్వేచ్ఛా జీవి. 1350 లో భట్టపరాశరుని శిష్యుఁడైనాడు రాజాస్థానములలో తాను గోరుకొన్న స్వేచ్ఛ కనఁబడలేదు. సుంకసాలలో ఆజన్మాంతము నుద్యోగిగానుండినాడు. ఆర్థికదుస్థితులను లెక్కచేయలేదు. 1370 లో మాంధాతృ చరిత్ర మహాకావ్యమును సృష్టించినాడు. క్రీ. శ. 1400 లో తనను నిరాదరించిన లోకమును శాశ్వతముగా విడిచిపెట్టినాడు.

అతని[34] మాంధాతృచరిత్ర రాజులకు ఆదర్శ మని తలచినాడు. అతని స్వైరజీవితము కవులకు ఆదర్శము. ప్రపంచకములో నృసింహకవివలె ఆత్మస్వాతంత్ర్యమును తక్కిన వాటికంటె మిన్నగాఁజూచిన మహాకవులు అరుదు. అతఁడు మహాకవియే కాక మహాపురుషుఁడు గూడ.

---

33. కవి జీవితములు (గు. శ్రీ.) పు 461

34. విమలాంగి పరిణయమను మాంధాత చరిత్రమను పద్యకావ్యము కాకిట్రి పాఁకవి (1730.90) రచించినారు (ఆంధ్రకవి సప్తశతి పుట 143)

# పాపరాజకవి ప్రశంస

విద్వాన్ శ్రీ గున్నేపల్లి అక్షయలింగకవి.

గీ. రసము చిప్పిల నుత్తరరామచరిత
మాంధ్రగీర్వాణ పదముల ననువదించి
ప్రౌఢి చూపిన కంకంటి పాపరాజు
కవివతంసులలోనఁ బ్రఖ్యాతి గాంచె 1

గీ. కొన్ని చోటులఁ దిక్కన్నకన్న మించి
కొన్నిపట్టుల శ్రీనాథుచెన్ను గాంచి
కొన్నియెడలను బెద్దనగుణము వడసి
పాపరాజు రచించెఁ గావ్యము నయారె! 2

గీ. పాకభేదమ్మనసె కాదు పాపరాజు
కల్పనాకౌశలమునఁ దిక్కన రచించి
నట్టి రామాయణముకన్న నఖలగతుల
నతిశయించెను నెంతప్రజ్ఞాన్వితుండొ! 3

గీ. పాపరాజ కవీంద్రు ప్రబంధమందు
శబ్దచిత్రమ్ము లెన్నేని సంఘటిల్లు
నవ్వి సామాన్యకవుల కావ్యముల నున్న
పగిది వృథకాక సరసార్థబంధురములు. 4

గీ. వృత్తులును, భావశయ్యావిభేదములును
ధ్వనులు, రీతులు నర్థసందర్భములును
నెట్టు వెలయింపవలయుఁ దా నట్టు లరసి
కూర్చెఁ గృతి పావరాట్కవికుంజరుండు. 5

గీ. ఇంపుఁ బెంపార ననవద్యహృద్యశబ్ద
రత్నపుంగల్మిఁ గావ్యేందిరకు ఘటించి
ప్రథితయశమందు నల పాపరాజువోలె
కృతి రచించిన సర్వసమ్మతము గాదె! 6

గీ. జన్మము తరింపఁ గర్ణరసాయనముగ
నవరసస్ఫూర్తి వెలయువర్ణనలు పెంచి
భగవదర్పితముగను గావ్యము రచించె
తలఁప నితఁ డెంతయును ధన్యతముఁడు గాదె! 7

గీ. సరసమై మనోహరమునై, చవులు గొలుపు
కవనమునఁగాక పాపరాట్కవివరుండు
నయకళాభూతిఁ దత్త్వవిజ్ఞానగరిమ
గణితశాస్త్ర నైపుణిని బ్రఖ్యాతివడసె. 8

గీ. కూర్మిమైఁ బాపరాజవాగ్గుంఫనముల
నరసి యొల్లెడ నాధునికాంధ్రకవులు
స్ఫురదలంకారకలితమై సొంపు గులుక
సంస్కరింతురు గాక! భాషావధూటి. 9



## గ్రంథస్వీకారము; సమీక్ష

(శ్రీ బండారు తమ్మయ్య)

దేవగంగె: భాష కన్నడము. పుటలు 496. రాయలుసైజు వెల రు 30-0-0 లు. ప్రకాశకులు: బి. శివమూర్తి శాస్త్రిగారి షష్టి పూర్త్యుత్సవ సమితి, బెంగుళూరు.

ఇది బెంగుళూరులో వెలువడు "శరణ సాహిత్య" పత్రికా సంపాదకులును, పండితరత్న పద్మశ్రీ ఇత్యాది బిరుదాంచితులును, కన్నడ సాహిత్య పరిషదధ్యక్షులునునగు శివశ్రీ బి. శివమూర్తి శాస్త్రి గారి షష్టిపూర్తి సందర్భమున 1968 సంlలో వెలువడిన బృహద్గ్రంథము. ఇందు రెండవ భాగములో శ్రీశివమూర్తి శాస్త్రిగారి నుద్దేశించిన ఆశీర్వచనములు, అభినందనలు, ప్రశంసలుకాక మొదటిభాగములో పలువురు ప్రఖ్యాత కర్ణాటభాషా విద్వాంసులు రచించిన సారస్వత వ్యాసములు 48 వరకు గలవు, ఆవ్యాసములు ఆంధ్రకర్ణాట భాషలకు రెండింటికి సంబంధించినవై యున్నవి, కావున వీనిని ఉభయభాషా సారస్వతములగూర్చి అభిరుచిగల పండితులందరు తప్పక చదువదగి యున్నది. అందరును నీప్రశస్తిగ్రంథమునకు స్వాగతమొసంగుదురు గాక ! యని హెచ్చరించుచున్నాము.



# మహాత్మాని గాంధి

కీ. శే. డా॥ మానేపల్లి కుమారస్వామి,

కడఁగి పూర్వాచార కలిసధర్మములకు. మచ్చికతో దగసచ్చజెప్పి
యాధునికాచర ణావివేకాళిని. సహనంబుగై కొని చక్కదిద్ది
మితిలే కధోగతి మిణుకుదురాచార, పరుల గనికరించి పైకి దెచ్చి
జాతిమతాదివై షమ్యంబులం ద్రెంచి, సమతత్వ విజ్ఞత సంతరించి

మాతృదేశీయ దాస్యంబు మాసిపోవ
రాజ్యరమదెచ్చి మనకు స్వ రాజ్య మిచ్చి
స్వపరిపాలనా నందవై భవము చాటి
స్వజనసౌభాగ్య మిదె కరం చందు గాంధి॥

బ్రాహ్మణశరభముల్ పతితజాతిమృగేంద్రి. వైషమ్యభావముల్
పారద్రోలె
క్షత్రియసింహముల్ క్షతజాతి కుంజర, వైషమ్యభావముల్ వదలివేసె
వైశ్యశార్దూలముల్ - పతనజాతికురంగ. ములపైనివైషమ్య
ములనువిడిచె
శూద్రభల్లూకముల్ క్షుద్రజాతిపిపీలి, కములవైషమ్యముల్ కట్టిపెట్టె

పూర్వకాలము మునులత పోమహిమను
కానలను జంతువైరముల్ మానినట్టు
లహహ మనగాంధి మునితపో మహిమవలన
భరతజాతివైషమ్యముల్ మరుగువడియె॥

సుజ్ఞానపరిమళ శోభితయుతసమ, తత్వ మాపన్నీట తానమాడి
విజ్ఞాననై పుణీ వివిధవిద్యాజలా, శయముల తెలినీట - జలకమాడి
అజ్ఞానమవివేక మన్యజనాధికా,ర విసర్జనాపగన్ పరిమలమయి
పరిజ్ఞానపరమతా భక్షణచక్షణ, త్రిజటాజలంబుల - దేలియాడి

రవినమస్కృతిజేసి స్వ రాజ్య మనెడి
గట్టుపై కెక్కి శాంత్యను పట్టుబట్ట
గట్టి పరమేశు బూజింప గగనమునకు
జనినగాంధీమహాత్మయుం జలిఘటింతు॥

# పంచతంత్రము; దాని పుట్టుక

శ్రీనివాసపురం నరసింహాచార్యులు.

రమారమి ఏడెనిమిదేండ్లనాడు ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికలో శ్రీవిశ్వాత్ముల నరసింహమూర్తిగారి బొమ్మల పంచతంత్రము ప్రకటింపబడుచుండెను. కాని, అది పూర్తికాకమునుపే మరదురదృష్టవశమున నాకథాచిత్రకారుడు కీర్తిశేషు డగుటచే పత్రికలో పడినంతవరకు పుస్తకరూపముగా వేసిన ఆంధ్రపత్రిక గ్రంథమాలా ప్రకాశకులు తమమాటగా 'ఈపంచతంత్ర గ్రంథము పుట్టుక యెక్కడనో యెరుగరా' దని వ్రాసిరి. అది చదివినప్పుడు—జగము మెచ్చినశాస్త్రమును జంతు సంతానముల ద్వారా జనులకు తెలియజేసెడి కృతిని జేసి సుకృతిరైన యీమహాకవి జీవితవిశేషములను ఏతద్గ్రంథము యొక్క జన్మస్థానమును; ఉత్పత్తి కారణములను వీనినిగురించిన విషయములు విద్వత్పరిశోధకు లెవ్వరేని తెలిసికొని ప్రకటము గావించుట కింతవరకు ప్రయత్నింపరైరిగదా! యని విచారించి, యదిమొదలావిషయమును తెలిసుకొనుటకై యన్వేషింపసాగగా నిన్నాళ్ళకిప్పుడు ఆపంచతంత్రగ్రంథ మెప్పుడు, ఎక్కడ, ఎందుకు ఎట్లుపుట్టినదో నాకు తెలియవచ్చినట్టి విశేషములను సారస్వతాభిమానుల సమక్షమున నుంచుచుంటిని.

భారతదేశమునందలి సంస్కృతగ్రంథము లెన్నో అన్యభాషలలోని కనూదితము గావింపబడినవి. కాని, ఏదియు నీపంచతంత్రకావ్యమువలె పలుభాషలలోనికి పరివర్తనమై ప్రపంచవ్యాప్తి నంది సకల దేశములలోని సంస్కృతవిద్యార్థి విద్యాధికులకు గూడ పఠనీయమై యలరారుచున్న కృతి వెదకినను మరియొకటి కానరాదనుట ప్రాజ్ఞులంగీకరించిన నగ్నసత్యము.

ఈగ్రంథమున మిత్రభేదము, సుహృల్లాభము, సంధివిగ్రహము లబ్ధనాశము, అవిమృశ్యకారిత్వము అను ఐదుభాగము లున్నవి. క్రీ.శ. 531–579 సం॥ ప్రాంతమున పర్షియాదేశము నేలుచుండిన నౌషరు

వాన్ అనబడెడి పారసీకరాజు కాలమున నీగ్రంథము పహ్లవీభాషలో నికిని, క్రీ. 8వ శతాబ్దని అరబ్బీభాషలోనికిని, సైమియాన్ సేథ్ (Symeon Seth) అను నాతనిచే క్రీ. 1015 ప్రాంతమున గ్రీకుభాష లోనికిని, పాస్సినస్ (Possinus) అన్న యతనిచే లాటిన్ భాషలో నికిని రబ్బీజోయెల్ (Rabbi Joel) అను పండితునిచే క్రీ. 1250 ప్రాంతమున హెబ్రూభాషలోనికిని అతర్వాత నొకటి రెండు సంవత్స రములలో స్పానిష్ భాషలోనికిని పిమ్మట క్రీ. 15వ శతాబ్దని జర్మను భాషలోనికిని, అపై యూరపియను భాషలన్నింటిలోనికి పిల్పే లేక విద్యాయ్ ఫేబుల్స్ (Fables of Pilpay or Vid pai i.e. Vidyapati) అను పేరను ఇట్లు రమారమి రెండువందలమంది విద్యావేత్తలచే అన్ని దేశములలోను మొత్తముమీద సుమారేబది భాషలలోని కీయు గ్రంథ మనువాదము చేయబడియున్న దని హెర్టల్ అను పాశ్చాత్య పరిశోధకుడు తనహిందూదేశ కథాకావ్యచరిత్రములో వ్రాసియున్నా డు. ఈకావ్యముయొక్క ప్రశస్తి తెలియుట కీవిషయ మొక్కటి చాలును.

ఇయ్యది మాతృకయై యుండ దీని ననుకరించియు, అనుసరించియు మన దేశమున నెన్నియేని నీతికావ్యము లుదయించినవి. దీనికి సంగ్రహరూపమున సంస్కృతమున పంచతంత్రకావ్య - పంచతంత్ర కావ్యదర్పణ - పంచోపాఖ్యానాదులు పెక్కుకృతులు గలవు. అట్లే ఆంధ్రభాషయందును దూబగుంట నారాయణకవి, బైచరాజు వేంక టనాథకవి ప్రభృతులు పద్యకావ్యములుగను, కందుకూరు వీరేశలింగ కవి. పరవస్తు చిన్నయసూరి మొదలైన పండితులు గద్యరూపము నను, విశ్వాత్మ్మల నరసింహమూర్తి, శీలా వీర్రాజు మున్నగు చిత్ర కారులు బొమ్మలకథలుగను వెలయించిరి.

ఇంతటిప్రశస్తికి పాత్రమైన యీకృతిని విద్యాపతిబిరుదనామధేయుడైన విష్ణుశర్మ పండితుడు రచియించెను.

కృత్యాదియందు—

"మనవేవాచస్పతయే శుక్రాయ పరాశరాయ ససుతాయ
చాణక్యాయ చ విదుషే. నమో ఽస్తు నయశాస్త్ర కర్తృభ్యః॥
సకలార్థశాస్త్రసారం జగతి సమాలోక్య విష్ణుశర్మేదమ్,
తంత్రైపంచభి రేత చ్చకార సుమనోహరం శాస్త్రమ్॥

అని చెప్పుటనుబట్టి యితఁడు ప్రాచీనములైనమను: అత్రి;విష్ణు హారీత; యాజ్ఞవల్క్య; ఉశన; అంగిరస; యమ; ఆపస్తంబ; సంవర్త; కాత్యాయన; బృహస్పతి; పరాశర; వ్యాస; శంఖ; లిఖిత;దక్ష;గౌతమ; శాతాతప; వశిష్ఠాదివింశతిధర్మశాస్త్రములనేగాక చాణక్య విష్ణుగుప్త కౌటిల్యుని అర్థశాస్త్రము మొదలైనరాజనీతిశాస్త్రముల నన్నింటిని సాకల్యముగ ఆపోశనముపట్టి యీకళింపునకు దెచ్చుకొని ఆకాలమున 'విద్యాపతి'బిరుదవిఖ్యాతుడై వినుతింపబడియుండె నని చెప్పనగును.

గ్రంథావతారికలో :—

"దక్షిణదేశమండలి మహిళారోప్యపురము నేలెడిఅమరశక్తి యనురాజు దుర్వినీతులైనతనకొడుకులకు నీతి నేర్పు మని కోరగా వారికై నే నీ నీతిశాస్త్రమును రచియించితి"ననుమాటలు వ్రాసియుండుటనుబట్టి యీకవి దక్షిణదేశవాసి యైనయాతేసియాస్థానమున విద్వత్కవిగా నుండెనని భావింపవచ్చునుగాని, ఈవిషయమునే పరిశోధకులును గుర్తించియుండలేదు. అందుచే నీమాట గ్రంథప్రశస్తికై యాతడు కల్పించివ్రాసినదో లేక నిజమో యూహింప నలవి గాకున్నది." అని బ్రహ్మశ్రీ మల్లాదిసూర్యనారాయణశాస్త్రిగారు తమ సంస్కృతకవిజీవితము పుట 130లలో వ్రాసిరి.

క్రీస్తుమొదటశతాబ్దియందు హిందూదేశమున క్రైస్తవ మతము వ్యాపించిపోవు రెండవశతాబ్దిలో నది దక్షిణభారతమున నేటి మదరాసుప్రాంతమున సుస్థిరముగ పాదుకొనినట్టు చరిత్ర తెలియ జేయుచున్నది. అప్పుడు అనఁగా క్రీ.2వశతాబ్ది యారంభకాలమున బలాఢ్యుఁడైనఅమరశక్తి యనురాజు మహిళారోప్యపుర మనబడెడి ప్రాచీనహైందవనగరమును రాజధానిగా జేసికొని రాజ్యపాలనము చేయుచుండెను. అదేనేడు మైలాపూరు అని వ్యవహరింపబడుచు మద రాసుమహానగరమున నంతర్భాగ మైపోయినది. ఈమహిళారోప్యపుర మునే గ్రీకుదేశస్థుఁడైన టాలెమీ (Ptolemy 140–150 A. D.) యనుభూగోళశాస్త్రజ్ఞుడు 1. పశ్చిమభారతదేశము, అఫ్ఘనిస్థానము, బెలూచిస్థానము (India Intra Gengem) 2. ఆగ్నేయాసియా, చీనాదేశము (India Extra Gengem) అనుపేర్లతో వ్రాసిన భారతదేశభూగోళగ్రంథమున రెండవభాగమందు దక్షిణదేశభౌగో ళికస్వరూపనిర్ణయము చేయుసందర్భమున 'మహిళార్ఫ' (Mahi-larpha) యని పేర్కొనియుండినట్లు శ్రీఅక్షయకుమార్ మజుందార్ గారు తమహిందూహిస్టరీ యనుగ్రంథమున 844పుటలో వ్రాయు చున్నారు.

పైనిచెప్పిన అమరశక్తిరాజునకు బాహుశక్తి, ఉగ్రశక్తి, అనంతశక్తి యనెడినిరక్షరకుక్షులు మూఢులు నైనముగ్గురుకొడుకు లుండిరి. మూర్ఖమూర్ధన్యులైనయాకుమారత్రయమునకు విద్యా బుద్ధులు గరపి గుణవంతులుగ చేయుటకై యారాజు చేసినప్రయ త్నము లన్నియు నిష్ప్రయోజనము లయ్యెను. తుట్టతుదకు దైవవశ మున అశీతివర్షప్రాయుడును, విద్యావృద్ధుడును ఆకాలమున పేరు మోసినపండితుడును నైనవిష్ణుశర్మను ప్రార్థింపగా రాజుకోరిక నంగీక

రించి యాయువరాజత్రయము నాత్మశిష్యులుగా గ్రహించి వారిమన
సున క్లిష్టమైనవిధమున పశుపక్ష్యాదులసంభాషణముచేసినట్లు నీతిధర్మ
ములు నిండైయుండ అద్భుతములైనకథలు చెప్పుచు వారిని వశవర్త
లను గావించుకొని మనసునకు నొప్పి గలుగనీయక నీతినేగాక జీవిత
రహస్యములును, రాజ్యతంత్రములును మొదలైనసర్వవిషయము
లును బోధించి వారిని గుణకోవిదులను గావించి తండ్రి కప్పగించి
యాతనిచే మన్ననలు పొందెను. ఈవిషయములు శ్రీ వి. కె. మజుం
దార్ గారు తనుగ్రంథము 716 పుటలో వ్రాసియున్నారు. ఇట్లగుట
చేతనే కథలు, కట్టుకథలు పీనికూర్పు నేర్పున భారతీయులు సర్వ
ప్రపంచమందలిమానవజాతికిని బోధకులైరని గుణపక్షపాతియైన
ఎలిఫిన్‌స్టన్ మహాశయుడు తనహిందూదేశచరిత్ర తొమ్మిదవముద్రణ
172వపుటలో నుల్లేఖించియున్నాడు.

ఈయాధారములతో సంస్కృతకవిజీవితకారునిసంశయము తీరి
మన కొకమార్గము దొరికినట్లయినది.

ఇంతకును విద్వన్మణియైనవిష్ణుశర్మజీవితచరిత్రము పూర్తిగా
లభింపదయ్యెను. ఈతడు తనకథలలో నవకాశముగల్గినప్పు డంతయు
బౌద్ధభిక్షువులను, జైనసన్యాసులను, యాయావరీయబ్రాహ్మణులను
తఱచుగా నుపాలంభము చేసియుండెను. ఒకకథలోని సందర్భమును
పురస్కరించుకొని యొకానొకనక్కనోట 'అహో! నేడు భట్టారక
వారముగదా! మాంససంబంధమైన యీనరమును నాదంతములతో
నెట్లు స్పృశింపగలను!' అని పలికించుటను పరిశీలనాదృష్టితో నాలో
చింతుమేని ప్రాచీనకాలమున భానువాసరమున మాంసాహారము
నిషేధింపబడినట్లెచ్చటను కానరాకున్నది. గనుక ఆకాలమున నీ
మహిళారోప్యపురము (Mylapore)న నెలకొనియుండినక్రైస్తవులు
ఆదివారమున మాంసాహారము, మద్యసేవనము, దైనందినచర్యయు

మాని విధిగా నుపవసించి యారాధనా మందిరములలో గుమిగూడి శ్రద్ధాళువులై తమ మతగ్రంథమైన బైబిలును పఠించుచుండెడి వారి యాచారముల వాలకము నతిచమత్కారముగ నవహాస్యముచేసి సహేతుకమైన వ్యాజవినయమును ప్రదర్శించి యుండె నని తోపక మానదు.

మదరాసు ప్రాంతమునందలి మైలాపూరున బుట్టి ప్రముఖ్యత నందె కాలక్రమమున సకలజగత్సంస్తూయమాన మైన దీ పంచతంత్ర గ్రంథ మని తెలిసియే పరవస్తుచిన్నయసూరి ప్రత్యేకించి దీనియాంధ్రీకరణమునకు బూనుకొని యుండెనేమో యనిగూడ తలంప వీలు లేకపోలేదు. గ్రంథము సాంతముగ ముగిసియుండినచో దీనిచరిత్రను గురించి ఆమహామనీషి గ్రంథప్రస్తావనములో వ్రాసియుండునేమో కదా!

"విష్ణుశర్మయొక్క యీకృతి గుణాఢ్యుని బృహత్కథలోని కొన్నికథలకు వచనరూపమైన సంక్షేపానువాదము. ఈగ్రంథమున నందందు గానవచ్చెడి శ్లోకములు కొన్ని యీతడు స్వయముగా రచియించినవే యనవచ్చును గాని, పెక్కు శ్లోకములు మనుస్మృత్యాది పూర్వగ్రంథములనుండి స్వీకరించినవే యనదగును. కాని, క్రీ. శ. 8వ శతాబ్దివాడైన దామోదరగుప్తుని కంథళీమతనామాంతర కుట్టనీ మతమునందలి "పరబ్క్యః స్వాస్తరణః పతి రనుకూల" యన్నశ్లోక మీతని పంచతంత్ర మిత్రభేద ప్రకరణము నందును, క్రీ. 9వ శతాబ్ద ఉత్తరార్థమువాడును ఔత్తరాహుడును నైన రుద్రభట్టుయొక్క శృంగారతిలకములోని "సార్థంమనోరథశతై" అనెడి శ్లోక మీగ్రంథమున లబ్ధనాశతంత్రము నందును గనిపించుచుండుట వలనను ఇంగ్లండులోను జర్మనీదేశమునందును ముద్రితమైన "పంచతంత్రము"నకును భారతదేశమున వ్యాప్తిలోనున్న గ్రంథమునకును కొన్నిచోట్ల భేదము

కానవచ్చుచున్న దని సర్. సి. పి. బ్రౌను పండితుడు చెప్పుటచేతను, గ్రంథము దేశమున వ్యాపించినకొలది రోజులలోనే కర్రిమేపి అర్వాచీనులకృతులలోని శ్లోకము లీపంచతంత్రమున ప్రక్షిప్తము లైనట్లు విమర్శనా చక్షువులకు విదితముగాక పోదనుట సత్యదూరము కాదు.

ఇంతవరకును గ్రంథప్రశస్తి దానిమార్పు జన్మస్థానము కృతికర్తవైదుష్యము పీనింగూర్చిన విషయము లుటంకించితిని. ఇఁక కాలనిర్ణయమునుగూర్చి మల్లాదివారనిన మాటలంజెప్పి మతాంతరములు జూపించి పర్యవసానముం జెప్పి యీనావ్యాసమును ముగింతును,

క్రీస్తు ఆరవశతాబ్దిని మొట్టమొదట నీపంచతంత్రగ్రంథము పర్షియను భాషలోని కనువదింపబడినది కనుక అంతకుమున్నె యీగ్రంథముపుట్టినదని కొందరును, దాక్షిణాత్య నృపతి రిత్యాదిభర్తృహరిసుభాషిత త్రిశతిలోని శ్లోక మిం దుండుటంబట్టి దానితర్వాత నిది జనించిన దని మరికొందరునుపేతచ్ఛ్లోక మిదిపుట్టినతర్వాత చేరియుండు ననెడి భావమున సుభాషిత త్రిశతికన్నను పంచతంత్రమే ప్రాచీనమని పల్కుచున్నారు గనుక విష్ణుశర్మకాలము సునిశ్చితము కాకున్న దని సంస్కృతకవి జీవితము 18 పుటలోవ్రాసిరి.

ఏవిధముగ జూచినను భర్తృహరి క్రీస్తుకుపూర్వు డగునని పలువురు పండితులభిప్రాయము నొసంగియున్నారు. కావున మన మీసందేహమును వీడిమతాంతర మైన యభిప్రాయముల నరయుదము.

డాక్టర్ : యం. కృష్ణమాచారియార్ (మద్రాసు) గారు తమ హిస్టరీ ఆప్ క్లాసికల్ సాంస్క్రిట్ లిటరేచర్ అన్న పేరున 1937 సం॥ ప్రకటించిన గ్రంథమున నీవిష్ణుశర్మను క్రీ.పూ. 776 సం॥ నాటివాడుగా గుణాఢ్యునికన్నను ముందు కూర్చుండపెట్టుట యెట్లో పరిశోధకులు నిర్ణయింతురు గాక!

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు 'యెట్లయిన నితడు శా. శ. 450 కి పూర్వుడు గాని పరుడుమాత్రము కా'డని తాటస్థ్యముగ తమయభిప్రాయమును చెప్పిరి.

విషయ మంతటిని సమన్వయముజేసి చూచినచో విష్ణుశర్మ తప్పక క్రీ. 2వ శతాబ్ది ప్రథమపాదము నాటివాడనియు నేటిమదరాసు మహానగరమున నొకభాగమైన నాటిమహిళారోప్య పురము నేటి మైలాపూరునంది పంచతంత్రము పుట్టినదనియు ప్రపంచమునకు తెలియ వచ్చుట సాహిత్యారాధకులకు సంతోషదాయకము కదా !

ఈవ్యాసమును వ్రాయుసెడల నేను పేర్కొన్న గ్రంథకర్తలకును, ప్రకాశకులకును కృతజ్ఞతలు చెప్పుచు విరమింతును.



శ్రీ వరాహ లక్ష్మీనృసింహస్వామినే నమః

# ప్రణయసుందరి

★

శ్రీ మండా అప్పలనరసింహమూర్తి.

సీ॥ కలువతేనిని మించుకాంతి యోనెమ్మేన
వలిపంపుపావడ పైటవైచి
గబ్బిగుబ్బలపైన గాజుపూసలసరుల్
చందిరహారముల్ చిందులాడ
సందిళ్ల కంకణాల్ చక్కనినూపురాల్
వరమణిమేఖలాల్ పరిఢవిల్ల
చెలువుగ బూసరుల్ చెరివినవేనలి
జఘనంబుపై బడి జాఱుచుండ

గీ॥ నాగవల్లికల్ నేర్పుతో నమలుకొనుచు
వలపు గులికించునొయ్యార మొలుకుచుండ
అందముగ నడచుచును రాయంచవోలె
వచ్చి నామెడ బూమాల వైచెఁ దరుణి!



# ఝుంఝు

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి

కం॥ దారుణవైఖరి ఝుంఝూ
మారుత మతిభీకరక్రమక్రమగమనా
పారంబై యాంధ్రావని
హోరున వ్యాపించి మించె నురుతరశక్తిన్.

సీ॥ స్వగృహంబునం దుండజాలక బైటకుం
జనలేక తతభీతి జనత గనియె
అల్పంబు లధికంబు లై సవృక్షములెల్ల
వ్రేళ్ళతో నిండ్లపై విఱిగి పడియె
తూరుపుసంద్రమందున్ లేచి కెరటముల్
వచ్చి సర్వస్వమున్ వడిగ ముంచె
ఇనుప రేకులు పెంకు లెగిరి విద్యుద్దీప
పాశమ్ములం ద్రెంచి పాఱవైచె
తే॥ గీ॥ ఉండుటకుఁ దావి, తినుటకుఁ దిండి లేక
తెనుఁగువారెల్ల జీవన్మృతి వహించి;
రెంతటియనర్థకాభిఖ్య నెసఁగె దీవు
భవ్యనామంబ! సౌమ్యసంవత్సరంబ!

ఉ॥ శీతలవాతజాతముల
చేత సమస్తజనంబు రోగులై
యాతన లందుచుండిరి భ
యానకమానసులౌచు; నక్కటా!
యీ తఱిఁ బాడిపంటలకు
నెల్ల వినాశము సంభవించె; నాం
ధ్రీ! తనుజాళిబాధలను
దీర్ప విదేమి? భరింపలేమికన్.

మ॥ విపరీతంబుగ నష్టకష్టములఁ గ
  ల్పించెం జుడీ! కాకినా
డపురిన్ సర్వజనాళికిన్ నిలువ నీ
  డ లేవు; ఝుంఝూర్భటీ
విపులావేశముచేత; నాంధ్రవిభు లీ
  విధ్వస్తవారంబు స
త్కృప రక్షింపఁగ నా దదీప్సితతతా
  ంగీకార మేపారఁగన్.

ఉ॥ భూములపన్నులన్ విడిచి
  పుచ్చుడు; పేదలయిండ్లఁ గట్టు; డా
సీమల గాలివానల న
  శించినవారలజాయలన్ దయన్
ఆమరణాంతమున్ బెనుచు
  డన్నము బట్ట లొసంగి; రోగముల్
వే మరలింపు; డాంధ్రపృథి
  వీపరిపాలకులార! వైళమే.



# ఐరావత చరిత్రము

శ్రీ రాళ్లపల్లి సుందరం; శ్రీ తిమ్మరాజు గోపాలకృష్ణ.

ఇది ఏకాశ్వాసము కలిగినపద్యకావ్యము. ఇందు మొత్తము 119 పద్యము లున్నవి. శిథిల మైనప్రతినుండి (D. 430) మదారాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున తెలుగుపండితులు శ్రీ తీర్థం శ్రీధరమూర్తి గారిచే మరల వ్రాయబడినది. (R. 2602) ఈ చిన్న కావ్యమునకు కర్త ఎవరో తెలియదు. గ్రంథము చిన్న దైనను రస వంతముగనే ఉన్నది.

ఈకావ్యమునందలి పాత్రిలు భారతమునకు సంబంధించినవారు. కావ్య మీక్రిందిపద్యముతో మొదలగుచున్నది.

చం॥ అనఘవరేణ్య! నాదుచెవు లారఁగఁ గౌరవపాండవేయవ
ర్తనములు సర్వముం బ్రకటితంబుగ నీకృప వింటి శైశవం
బునను ధనంజయుండు సురపుంగవుదంతి ధరిత్రికిం బలం
బునఁ గొనివచ్చి కుంతి వ్రతముం దగఁ జేసినభంగిఁ జెప్పవే!
అనిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె'.

ఈకావ్యమునందలికథ సంగ్రహముగ నిట తెలుపబడుచున్నది.

ధృతరాష్ట్రుఁడు రాజ్యము పరిపాలించుచుండ కౌరవ్యకౌంతేయులు ద్రోణునియొద్ద విద్యాప్రావీణ్యము సంపాదించుచుండిరి. ఒక్క నాడు బాదరాయణుఁడు వచ్చినాఁడు. గాంధారి అభివందన మాచరించి కరకమలంబులు మొగిచి ఇట్లనినది. 'ఏమివ్రతము నోచిన భామినులకు మేలు కలుగును- కామితవస్తుప్రద మగునది చెప్పుము.' ఆమహా ముని ఐరావతము నోమునోచు మనినాడు. ఆమె అభ్రదంతావళము నెట్లు తెచ్చుట అని సందేహించినది. అప్పుడు వ్యాసమునీంద్రుఁడు- 'అమరకరిఁ దేఁగ నెవ్వరి కలవిగాదు- మృత్తికఁ బ్రతిజేయు మ'నెను.

గాంధారి సుయోధనాదిసుతశతంబును రావించినది. 'ఐరావతము నోము నానతియిచ్చెన్ జని మీరది తేఁగలరో! ఘన మగు మృత్తికనునైనఁ గావించెదరో!' అన వారు రెండవమాట కియ్యకొని

నారు. అశక్తులైనవారు మతిఏమి పల్కుదురు! గాంధారియు మంగళస్నాతయై మృగమదఘనసారమిళిత మైనచందనఘనలేపనము చేసి, కనకరత్నభూషణములు దాల్చి, పుష్పదామకములు ధరియించి, పసిడిఅందలము నెక్కి, లలితపుణ్యాంగనాలలనలు నరుదేర నైరావతముకడ కరుగుదెంచినది. ఇంతలో నూర్గురుపుత్రులు మట్టిప్రతిమ సిద్ధముచేసినారు. ఆమె పూజచేసినది. వాయనము లిచ్చినది. కాని కుంతినిమాత్రము పిలువలేదు. సుయోధనునికి తల్లికదా! కుంతిచిత్తమున వేదనతోనుండ అర్జునుఁడు వచ్చినాఁడు. తల్లిస్థితి చూచి జాలి చెందినాడు. కారణ మడిగినాడు. గాంధారి చేసినయెగ్గు వివరించినది కుంతి- 'ఎల్లవారలన్ గనుఁగొని పిల్వఁబంచెఁ దనగర్వము పెంపున నన్నుఁ దాను రమ్మనుటకుఁ బోల దెంతయు ననాదరణం బొనరించె నర్జునా' అనినది. ఆమెను పిలువనందుకు కాదుకోపము కుంతికి. అందఱను పిలచిన దట! ఎంతైనను స్త్రీ కదా కుంతి! తనకొడుకులు మట్టి ఏనుగుచేయుచున్నా రని గాంధారి గర్వపడుచున్న దని అర్జునునితో చెప్పినది కుంతి. దీనిలో- నీవు ఐరావతమునే పట్టి తేలేవా- అని ధ్వనించుచున్నది. అర్జునుడు ప్రతిజ్ఞ యొనరించినాడు. జంభారాతిగజమును తప్పక తెత్తు ననినాడు. ఈయ లేకున్న 'నీ యడుగులోన శస్త్రసన్యాస మొగినట్లు సేయువాడ' ననినాడు. తత్క్షణమే హరిపేర లేఖ వ్రాసి దివ్యాస్త్రమున గట్టి గురుని భక్తితో తలచి అమరావాసమునకు బూసి వదలినాడు. అదిసభాస్తంభమునకు లక్ష్యభూతమై వదల బడినది. దేవతాపతియొద్ద నున్నకరణము పత్రిక చదివినాడు. ఇంద్రునకు కోపమువచ్చినది. 'కటము లదరక్రోధకంపితాధరోష్ఠుఁ డగుచు భీషణోక్తులు పలికినాడు. యుద్ధమునకు సిద్ధపడుచుండ సత్యాసత్త్వవిదు డైనచారదుడు దరహసితవదనారవిందుం డగుచు వచ్చి వారించినాడు.

'నరనారాయణు లాదిమూర్తులు జగన్మాన్యప్రభావోన్నతుల్
ధరణీభారము మాన్పఁబూని మనుజత్వం బొందినా రిప్పుడా
నరుఁ డీయర్జునుఁ డిట్టు లయ్యెరువురన్ సంగ్రామరంగంబునం
బరిమార్పంగల రింతమీఁద బహుళప్రత్యర్థి పృథ్వీశులన్' (౯౩)

పృథ్వీశుల పరిమార్పగల రని భావిసూచకము చేసినాడు నారదుడు. ఇంద్రుడు చల్లబడినాడు. ఎప్పుడూ ఆగంభశూరత్వమే ఇంద్రునిది! నారదుని పంపున పార్థుపేర లేఖపంపినాడు. పత్రిక చేతి కందినది. ఇక దేవలోకమునుండి ఐరావతాదులను దెచ్చుట ఎట్లు? అర్జునుడు బాణములతో దివ్యసోపానపంక్తిని నిర్మించినాడు. పిమ్మట కెందామరపుష్పములు కావలసివచ్చినవి. అర్జునుఁడు 'ఎక్కడ ఉండునా!' అని శంకించి లంకాపురమున గలవని బాణముతో లేఖను పంపినాడు! లంకాపురమున తప్ప కెందామరలే లేవు కాబోలు! విభీషణుడు అప్పుడు లంకాపురము నేలుచున్నాడట! అర్జునునిలేఖ చదివి కెందామరపుష్పముల నిచ్చి పంపించినాడు విభీషణుడు. పిమ్మట ధర్మరాజు రాజులనందర రావించి పుర మలంకరించినాడు. అర్జునుడు ఐరావతమును గొనిరాగా కుంతి మిగుల సంతోషించినది. గాంధారిని పిలిచినది కుంతి. కాని ఆమె వచ్చునా- రాలేదు.

'తొలి తాను నోమునప్పుడు
తలపక యున్నట్టిబేలతనమును మదిలోఁ
దలపోసి సుబలనందన
చెలియల! నేరాను నీవుచేయుము వ్రతమున్'

అనినది.

కుంతి వ్రతము యథావిధిగ నిర్వర్తించినది. వారిని చూచి జనులు మెచ్చినారు.

'పాలఁతులకపరిమోజనవుఁబుత్రిలు నూర్వురు నేల! చాలఁడే
బలవదరాతినిర్జితుఁడు పార్థునిబోలు కుమారుఁ డొక్కరుం
డలఘుఁడు! వీరుఁ బుత్రిఁ డగునట్లుగ నేమితపంబుసేసెనో!
యిలఁ దొలిమేనఁ గుంతి జగదేక మహోన్నతి గాఁగ నెంతయున్'

ఈచిన్నకావ్యమున పాత్రపోషణ కంత అవకాశము లేకున్నను ఉన్నంతలో పాత్రలస్వభావమును చక్కగ వ్యక్తపరచినాడు కవి. కుంతి గాంధారిపాత్రలను పోల్చి వారిస్వభావతారతమ్యమును బహిర్గత మొనర్చినాడు. ఆమెకు గలగర్వమును (గాంధారి)

'చింతింపదు సిరిమదమునఁ
గుంతిం బిలువంగఁజనదు కొడుకులు దానున్
సంతసమున సుబలాత్మజ
యంతఃపురమునకు జనియె నంచితలీలన్'

అని చక్కగ వ్యక్త మొనర్చినాడు.

అర్జునుఁడు వీరరస ముట్టిపడురాకుమారునిగ నిరూపింపబడినాడు. తల్లి మీాద అతనికి గలప్రేమ సువ్యక్త మొనర్చి ఆత్మబలముపై అర్జునునికి గలనమ్మకము ప్రస్ఫుట మొనర్పబడినది. కుంతి అభిమతము నెరవేర్చుటకు చేసినప్రతిజ్ఞ రసమునకు దగ్గశైలిలో రచించె.

'అంభోజాండభవాచ్యుతేశులు మదీయస్ఫారదోర్గర్వసం
రంభప్రక్రియఁ బూని మెచ్చ రిపుదుర్వారుండనై నేర్పునన్
రంభాదిత్రిదశాంగనాసురభిగీర్వాణాద్రివాతంబుతో
జంభారాతిగజంబుఁ దెత్తు భవదైశ్వర్యంబవార్యంబుగన్ (౩౯వ పద్యం).

కుంతి మాటలలో కరుణ యుట్టిపడునట్లు రచించినాడు కవి.

'బాలురు మీారలు పాండున్ప
పాలుఁడు దివికరుగవీరిపంచలఁ బడి యీా
లీల నభాగ్యవుకూటికిఁ

బాలై తిమి యిదియు నొక్కబ్రిదుకె కుమారా!'
ఇది చక్కని తెలుగును డిశారవుసొంపుతో జాలిగొలువు స్థితిలో రచి యింపబడిన పద్యము.

ఈకవి భారతశైలిని పలుచోట్ల అనుకరించినాడు. పద్యములు సామాన్యముగ కుంటువడక ధారాళముగ నడచును. అర్జునుడు శరము వేసినప్పుడు, భారతమున అర్జునుడు శంఖారావముచేసిన సందర్భమున రచితమైనపద్యముల బోలినపద్యము వ్రాసెను.

'పగిలెం దిక్కులు భూతధాత్రి వణఁకెం బాతాళలోకంబు బె
ట్టుగ ఘూర్ణిల్లెఁ బయోధులెల్లఁ గలఁగెన్ డుల్లె న్మహోల్కాతతుల్
నొగలెం బన్నగరాజకూర్మములవెన్నుల్ వ్రీలె మొగ్గంగరుల్
వగలం బారె ధరాధరంబులు భయం బందెన్ సురశ్రేష్ఠుఁడున్'

మఱియు భాగవతమునందలి 'కారేరాజులు...' అన్నపద్యమువంటిది.

'పుట్టరె! తొల్లి భూపతులు భూరిపరాక్రము లెందఱేనియున్
నిట్టలమైనమానవు లనేకులు పుట్టరె! వారిలోపల
న్నిట్టుల మానుషంబు పను లెవ్వరుచేసిరి యిందుఁ జెప్పఁగా
జిట్టలు నేఁడువీఁ డిటులుసేతు జగద్విపరీత మారయన్'

ఇందలి 119 గద్యపద్యములలో ఒక్కవిశిష్టవృత్తము మాత్రి మున్నది. అది లయగ్రాహి. ఇంద్రుడు అర్జునునకు వ్రాసినలేఖ—అందలి సారాంశము.

'శ్రీమతు సమస్తఖదరామరగణాధిపుఁడు
భీమరిపుదైత్యమదసామజవిభిన్నోద్దామ......'

ఇందు వచనములు తక్కువగనే యున్నవి. ఒకటి రెండు తప్ప అన్నియును చాల చిన్నవే. అందలిశైలియు హృద్యముగ నున్నది.

'అని పలికి మందాకినీనందనుండు పరమానందంబునుం బొంది బాహ్లికసోమదత్తధృతరాష్ట్రకృపాచార్యాదులు ననేకదండనాథ భట నికరంబులు నుత్సవాలోకనోత్సాహులై...'

కొన్నిపద్యములందు యతిభంగదోషములును గలవు.
'రెండవమాట కియ్యకొని రూఢి దలిర్చ...' (16వ పద్యము)
'పలికె నెల్లవారు వినుచు నుండ' (44వ పద్యము)
'పలు భేదింపఁగ నస్త్రసంతతి నభోభూ భాగ మధ్యంబునన్'
(81వ పద్యము)
'జనితమహాసమీరమున జొప్పడఁ గూలెఁ గులాగ్ణవంబు ...'
(84వ పద్యము(

కథయందు కుమారుడైన అర్జునుడు కలుగంప ఇంద్రునికి కోపము వచ్చుట నారదాగమనము అనవసర మని తోచును. కేంద్రా మరలకై విభీషణునికి కబు రంపుటయు వ్యర్థ మని తోచును. దీర్ఘము లైన కావ్యములను చదువుటకు శక్తి చాలని ఈకాలపు చదువరులకు ఈకావ్య మానందము గూర్పగలదు. కవి తన్నుగూర్చిగాని, కలమును గూర్చి గాని ఏఆధారమును జూపలేదు. ఇత డర్వాచీనుడై యుండ వచ్చును.

(కావ్యపరిశీలనకు దోహద మొనరించినమిత్రులు శ్రీ తీర్థం శ్రీధరమూర్తిగారికి కృతజ్ఞతలు.)

# ప్రాస్తావిక పద్యములు

శ్రీ రాళ్ళపల్లి సుందరం

చు ట్ట ల వా రు.

అగ్గిపెట్టెఁ దీసి యాత్రముతోడను
పట్టి కాల్చి పీల్చె చుట్టఁ నొకఁడు:
ఏమికర్మయనుచు నితరులు దిట్టిరి
యెవనికింపు వాని కింపుగాదె!

ఉ డు త.

అటుజూచు నిటుజూచు నన్నిదిక్కులఁజూచు
నిముసమైన నొకట నిలువలేదు
వీఁపున నానాఁడు ప్రేమతో రాముఁడు
చేతగీటె ననుచు జీటిచూపు
పటుకుపటుకుమని పళ్ళతోఁ గొఱుకుచు
మెడను ద్రిప్పుచుఁ జూచు మింటివైపు
చిటిక వేసినయంత చిందిలిపాటున
పరుగెత్తుకొనిపోవు భయముతోడ
జగతి మనుట కష్ట మనుచు జనుఁడుచాల
భయము చెందుచు నుండ నిర్భయముతోడ
చిన్నియుడుత యుండనగునె కన్నుమూసి
నిముస మొక్కయుగం బగు నిజముచూడ.

న ల్లి :

మనుజులరక్తము త్రాగుచు
చనెదవు నీదారి నీవు సరసర నల్లీ!
మనుజులరక్తము పిండుచు
కనుచుందురు మఱలిపోక ఖలు లీ ధరణిన్.

చీ మ లు :

కలసి మెలసి మీరు కట్టుబాటుకలిగి
మనుట చూడలేరు మనుజు లిలను
తెలివి యున్నదంచు ధీరుల మనుచును
చెప్పుకొనుట సరియె? చీమలార!

గ డి యా ర ము :

నీవు లేపినగాని నిదుర లేవను లేదు
కునుకుc దీయుచు నుండు కొసరికొసరి
నీవు చెప్పినగాని పోవగ నేరcడు
బ్రిదుకు తెరువు చూపువనులు చేయ
నీచలనము చూచి నిలువగ లేడింక
కమ్మగ మెక్కును కడుపునిండ
నిన్ను చూచినగాని కన్ను మూయగ లేడు
నీవె దైవ మనుచు నిలిచి మ్రొక్కు
నీకు బానిస యయ్యెను నిజము నరుcడు
కాలమహిమను దెలియంగcగాదు జగతి
నడిచి గడియారమా! యింక నన్ను నడిపి
కట్టుకొని పొమ్ము పుణ్యమ్ము కరుణగలిగి.

తు ర మ ర్ది ని గా ర్చి :

తల వంచనివీరుండును
కలిగినవాcడైనగాని ఖలుcడే యైనన్
పలుమారును దీనముగా
తలవంచును నీకు సరియె ధరలో తురకా!

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | | | |
|---|---|---|---|---|
| ♦ 1 సంపుటము | ... | ... | ... | 15-00 |
| ♦ 2 ,, | ... | ... | ... | 15-00 |
| 3 ,, | ... | ... | ... | 15-00 |
| 4 ,, | ... | ... | ... | 15-00 |
| 5 ,, | ... | ... | ... | 15-00 |
| 6 ,, | ... | ... | ... | 15-00 |
| 7 ,, | ... | ... | ... | 15-00 |

♦ పునర్ముద్రితముగా నున్నవి.

*Note :* 7 వ సంపుటానుబంధము (శ, ష, స, హా) లు కూడ ని
3 మాసములలో ముద్రితములు గాగలవు.

1241/4

ప్రతులకు :

ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)
రామారావు పేట
కాకినాడ

Edited By K. Krishnasastry.
Published by Andhra Sahitya Parishat &
Printed by J. Bhaskara Rao
at Republic Power Press, Main Road, Kakinad

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

## కాకినాడ

అధ్యక్షులు :

విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్
శ్రీ బండారు తమ్మయ్యగారు.

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి :

"అభినవ భోజ"
శ్రీ దంటు భాస్కరరావుగారు.

సహాయ కార్యదర్శి :

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)
శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు.

కార్యనిర్వాహక సభ్యులు :

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, కవికంఠీరవ, బ్రహ్మభూషణ
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
6. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ.
7. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ. (ఆనర్సు)
8. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
   శ్రీ వోలేటి వెంకటసుబ్బరాయశాస్త్రిగారు
9. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్.
10. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు
11. చిరువోలు వెంకటరామమూర్తిగారు.